శ్రీః

ఓన్నమస్సూర్యాయ

# ఋగ్వేద సూర్యసూక్తమ్

# జగన్నాథ సుధాలహరీ

పావనీవ్యాఖ్య

(ఆంధ్ర ప్రతిపదార్థ - తాత్పర్య - విశేషములు)

ఈమని వేఙ్కట సత్యనారాయణమూర్తి



ప్రకాశకులు

సాధన గ్రంథ మండలి, తెనాలి

వెల : రూ. 20-00

శ్రీః

ఓం నమశ్శివాయ

ఋగ్వేద సూర్యసూక్తమ్

# జగన్నాథ సుధాలహరీ

పావనీవ్యాఖ్య

(ఆంధ్ర ప్రతిపదార్థ - తాత్పర్య - విశేషములు)

ఈమని వేఙ్కట సత్యనారాయణమూర్తి



ప్రకాశకులు

సాధన గ్రంథ మండలి, తెనాలి

ఋగ్వేదసూర్యసూక్తమ్

**జగన్నాథ సుధాలహరీ**

పావనీవ్యాఖ్య

(ఆంధ్ర ప్రతిపదార్థ-తాత్పర్య-విశేషములు)

ఈమని వేఙ్కట సత్యనారాయణమూర్తి

ప్రథమముద్రణ:-21.9.2003 - స్వభాను - భాద్రపద బహుళ దశమి

ప్రతులు : 1000

పేజీలు : 74

వెల రూ. : 20-00



834, Daitavariveethi,
Railpet, Bapatla - 522 101.
Cell : 9440208059

2. సాధన గ్రంథ మండలి - తెనాలి - 522 201.

3. రావి మోహనరావు

4-103, I.L.T.D. Colony Extn.,
Kothapet, Chirala - 523 157, Prakasam Dist. A.P.
Ph.No.: 08594 - 234054

DTP by

**VIKRAM GRAPHICS**
Opp. M.R.O. Office
CHIRALA - 523 155
Ph.: 08594 - 237658

Printed at

KAMALA ART PRINITERS

Tenali. Ph : 225072, 224472.

శ్రీః

# ఋగ్వేద సూర్యసూక్తమ్ - జగన్నాథ సుధాలహరీ సుధాసమారాధనము

**సూర్యసూక్తము:-** సూర్యస్తుతిపరములైన సమస్త రచనలకు ఋగ్వేద ప్రథమ మండలమునందున్న సూర్యసూక్తము మూలమని భావింపవచ్చును. ఇది పఞ్చదశోత్తరశతతమ (115 వ) సూక్తముగా ప్రసిద్ధము. ఇందు మంత్రషట్కము కలదు. మంత్రద్రష్ట కుత్సమహర్షి, సూర్యుడు దేవత. ఈ సూక్తములోని షట్ (6) మంత్రములకు ఆయా యాగములందు వినియోగమున్నట్లు తెలియుచున్నది. సూర్యుడీసూక్తమున జగన్నేత్రముగా, ఉషోదేవిననుసరించువానిగా, సర్వస్వతంత్రునిగా, కాలనియామకునిగా, అలంకార సుందరంగా వర్ణింపబడ్డాడు.

**జగన్నాథ పండితుడు:-** జగన్నాథుడు తెలుగుదేశంలోని వేగినాటి బ్రాహ్మణ కుటుంబానికి చెందినవాడు. ఇతని పూర్వీకులు గుంటూరు జిల్లా తెనాలి తాలూకా దావులూరు గ్రామంలో నివసించేవారని కొందరి భావన. తూర్పుగోదావరి జిల్లాలోని అమలాపురం వద్ద నున్న ముంగండగ్రామం వీరి స్వస్థలమని చాలామంది విశ్వసిస్తారు. వీరి ఇంటిపేరు ఉపద్రష్టవారు. ఉభయత్ర నేటికీ ఉపద్రష్ట వారి కుటుంబాలున్నాయి.

లక్ష్మీదేవి పేరుభట్టు దంపతులు జగన్నాథుని తల్లిదండ్రులు. పేరు భట్టు గొప్ప సంస్కృత విద్వాంసుడు. అతడు జ్ఞానేంద్రభిక్షువు వద్ద వేదాంత శాస్త్రాన్నీ, మహేంద్ర పండితుని వద్ద న్యాయ వైశేషికాలను, శేషవీరేశ్వరుని వద్ద వ్యాకరణాన్ని అధ్యయనం చేశాడు. కాశీనగరంలో ఖండదేవుని వద్ద మీమాంసా శాస్త్రాన్ని అభ్యసించాడు. జగన్నాథ పండితుడు తన తండ్రి వద్దనే సకల శాస్త్రాలను అభ్యసించాడు. ఆయనను మహాగురువుగా సంభావించాడు. జగన్నాథుని పుట్టుట బాల్యం కాశీనగరంలోనే జరిగిపోయింది. జగన్నాథుని కాంధ్ర దేశంతో ప్రత్యక్ష సంబంధమున్నట్లు కనపడదు. చారిత్రకులు జగన్నాథుడు క్రీ॥శ॥ 1590 - 1667 మధ్యజీవనం సాగించాడని నిర్ణయించారు.

జగన్నాథుడు తన యౌవన కాలంలో ముందు జహంగీర్ ఆస్థానంలో కొంతకాలం గడిపాడు. జహంగీర్ మరణానంతరం ఉదయపూర్ మహారాజు

జగతసింహుని ఆస్థానంలో కొంతకాలం ఉన్నాడు. అప్పుడే జగత సింహుని ప్రశంసిస్తూ 'జగదాభరణ' కావ్యాన్ని రచించాడు. తరువాత షాజహాన్ చక్రవర్తికి మామ, ముంతాజ్‌మహల్ తండ్రి అయిన ఆసఫ్‌ఖాన్ జగన్నాథుని ఆహ్వానించి ఆశ్రయమిచ్చాడు. అప్పుడే ఆసఫ్‌ఖాన్ ప్రీతికోసం జగన్నాథుడు 'ఆసఫవిలాసాన్ని' రచించాడు. క్రీ॥శ॥ 1628లో సింహాసన మధిష్ఠించిన షాజహాను జగన్నాథుని పాండిత్యప్రాభవాలను విని, అతనిని తన ఆస్థాన విద్వాంసుడిగా నియమించాడు. జగన్నాథుని 'పండితరాజు' బిరుదంతో సత్కరించాడు. షాజహాన్ కుమారుడు దారా షికోహ్ సంస్కృతంలో గొప్ప పండితుడు. దారాకు జగన్నాథుడు గురవైయుండ వచ్చును. క్రీ॥శ॥ 1666 లో ఔరంగజేబు షాజహానుని బంధించి, సోదరులను సంహరించి ఢిల్లీ చక్రవర్తి అయ్యాడు. అట్టి క్లిష్టసమయంలో జగన్నాథుడు కామరూపరాజు ప్రాణనారాయణుని ఆస్థానంలో ఉండి 'ప్రాణాభరణ' కావ్యాన్ని రచించి యుంటాడు. ఆ తర్వాత వృద్ధాప్యంలో తిరిగి కాశీనగరానికి వచ్చినట్లు కొందరు భావింపగా, శేషజీవితాన్ని యమునా నదీ తీరంలో మధురలో గడిపాడని మరికొందరు భావిస్తారు.

జగన్నాథుని గూర్చి అనేక కథలు ప్రచారంలో ఉన్నాయి. అప్పయ్య దీక్షితుల వారొకనాడు ప్రభాతాన గంగాస్నానానికి వెడుతూ, గంగాతీర నికుంజంలో ఒక యువతితో పరుండియున్న జగన్నాథుని చూశారు. తెల్లని పిలక బయటకు కనపడుతూ ఉండగా గమనించి, అప్పయ్య దీక్షితులు 'ఏమయ్యా! ఈ వార్ధక్యంలో మృత్యువు సమీపిస్తుండగా నిర్లజ్జగా నిస్సంకోచంగా ఇలా నిద్రిస్తావా? అని మందలించబోయి, జగన్నాథుని హుంకారాన్ని విని, శయనించినది జగన్నాథుడని భావించి, వెంటనే 'సుఖంగా నిద్ర పోవయ్యా! నీ ప్రక్కనే గంగానది ఉన్నది కదా!' అని తనను తాను సంబాళించుకున్నారని చెపుతారు. ఆ ప్రక్కన శయనించినది జగన్నాథుని ప్రియురాలు 'లవంగి' అంటారు. షాజహానుని ఆస్థానంలో ఉండగా ఒకనాడు సౌందర్యరాశియయిన లవంగిని చూచి జగన్నాథుడు మోహించాడని, షాజహాను కూడా వారి ప్రణయాన్ని సమ్మతించి, ముందుగా జగన్నాథునిచే ఇస్లాం మతాన్ని స్వీకరింపచేసి, తరువాత యవన స్త్రీ లవంగినిచ్చి వివాహం జరిపించాడని ఒక కథ ప్రచారంలో ఉన్నది. యవన స్త్రీని వివాహమాడిన జగన్నాథుని అప్పయ్య దీక్షితులు కులాన్నుంచి బహిష్కరించారని, కనుకనే ఇద్దరికీ ప్రత్యక్షవైరం ఏర్పడిందని కొందరు వర్ణిస్తారు. అప్పయ్య దీక్షితులు

క్రీ॥శ॥ 1553-1623 ప్రాంతానికి చెందినవాడు కనుక జగన్నాథునితో ఇట్టి సంభాషణకు సందర్భం ఏర్పడి ఉండదని చారిత్రకులు భావిస్తున్నారు. ఏదిఏమయినా జగన్నాథ పండితుడు 'రసిక రాజు' అనటంలో ఎంతమాత్రం సందేహం లేదు.

జగన్నాథుని బుద్ధిశక్తి యద్భుతము. ఇద్దరు మహమ్మదీయులొక నది ఒడ్డున పరస్పరం ఘర్షణ పడ్డారు. వివాదం ముదిరి పాకాన పడ్డది. వారు షాజహాను ఆస్థానానికి తీర్పుకు వెళ్ళారు. వారి వివాదానికి సాక్ష్యంగా ఎవరయినా ఉన్నారా? అని ప్రశ్నించగా ఒక బ్రాహ్మణుడు కొంచెం దూరంలో ఉన్నాడని వాది ప్రతివాదులిద్దరూ చెప్పారు. ఆ బ్రాహ్మణుడే జగన్నాథుడు. జగన్నాథుని ఆస్థానానికి పిలిపించగా, తనకు వారి భాష తెలియదని, తాను విన్న దానిని ఉన్నదున్నట్లుగా విన్నవిస్తానని జగన్నాథుడు మనవి చేశాడు. జగన్నాథుడు వారి సంభాషణలను పూసగుచ్చినట్లు చెపుతుండగా వాది ప్రతివాదులిద్దరూ 'అంతే' 'అంతే' అని బదులిచ్చారు. చివరకు న్యాయ నిర్ణయం జరిగింది. షాజహాను జగన్నాథుని బుద్ధిశక్తికి జోహారులర్పించి, తన ఆస్థానంలో విద్వాంసునిగా నియమించాడు. ఇది మరియొక జనశ్రుతి.

**జగన్నాథుని రచనలు:-** శాస్త్రవాసన లేనివారికే కవిత్వ మబ్బుతుందని యొకమాట ప్రచారంలో ఉంది. శాస్త్రం బుద్ధిప్రధానం. కాగా కవిత్వం హృదయప్రధానం. శాస్త్రం లోను కావ్యంలోను సమానంగా పాండిత్యాన్ని ప్రతిభను ప్రదర్శించటం సామాన్యం కాదు. అట్టి అరుదైన వారిలో జగన్నాథు డగ్రగణ్యుడు. బృహస్పతి వచ్చినాసరే, వాగధి దేవతయైన సరస్వతియే సాక్షాత్తు వాదించినాసరే, ప్రతివాదం చేయటానికి నేను సిద్ధము - అనగల ధీశాలి జగన్నాథుడు. అంతేకాదు - ఆసేతు హిమాచలం ఉన్న కవులందరికీ నేను విన్నవిస్తున్నాను. మృద్వీకామధ్య నిర్యన్మసృణరసఝురీ మాధురీ భాగ్యభాక్కులయిన వాక్కులకు, ఆచార్యుడయ్యే అర్హత నాకు తప్ప వేరెవరికయినా ఉన్నదా? అని ప్రశ్నించగల ప్రతిభాశాలి జగన్నాథుడు. జగన్నాథుని కావ్యలహరుల్లోను, శాస్త్ర రచనల్లోను ఆయన మహాద్భుత ప్రతిభాపాండిత్యాలు గుబాళిస్తాయి.

**1) రసగంగాధరః** - జగన్నాథుని అలంకారశాస్త్ర పాండిత్యాని కీగ్రంథం మణి దర్పణం. దీనిలో జగన్నాథుని సాహిత్య ప్రజ్ఞతోపాటు శాస్త్రా న్తరపాటవం, వాద

చాతుర్యం, బుద్ధినైశిత్యం ప్రస్ఫుటమౌతుంది. కావ్యలక్షణం, విభాగం, హేతువు, రస సిద్ధాంతం, ధ్వని, గుణాలు, అలంకారాలు మొదలగు విషయాల్లో జగన్నాథుని సిద్ధాంతాలే నేటికీ కాలపరీక్షకు నిలిచి ఉన్నాయి. ధ్వన్యాలోక కావ్య ప్రకాశముల తర్వాత అలంకారశాస్త్రంలో మౌలికమయిన ఆలోచనలను ప్రకటించిన అలంకార శాస్త్ర గ్రంథ మిదే. తరువాత కూడ యీ స్థాయి గ్రంథాలు వెలువడలేదు. రసగంగాధరంలో ఆయా సందర్భాల్లో యిచ్చిన ఉదాహరణములన్నీ జగన్నాథుని స్వీయ కావ్యాలలోనివే కావటం గొప్ప విశేషం. అలంకార శాస్త్రంలో రస గంగాధరానికి సాటిరాగల గ్రంథం మరొకటి లేదు.

**2) గంగాలహరి:-** దీనికే పీయూషలహరి యని నామాన్తరము. 53 శ్లోకాలు గల యీ లఘుకావ్యంలో జగన్నాథుడు శిఖరిణీ వృత్తంలో గంగా మాత పావనత్వ వైభవాలను ప్రస్తుతించాడు.

**3) అమృతలహరి:-** దీనిని యమునాలహరి యని కూడా అంటారు. దీనిలో శార్దూల విక్రీడితంలో రచింపబడిన 11 శ్లోకాలున్నాయి. కవికి యమునా నదిపై గల భక్తి ప్రపత్తులిందులో పరిమళిస్తాయి.

**4) కరుణాలహరి:-**దీనికి విష్ణులహరి యని నామాంతరము. దీనిలో 55 శ్లోకా లున్నాయి. ఇది విష్ణుస్తుతి పరకమయిన లఘుకావ్యం. దీనిలోని శ్లోకాలు వంశస్థం సుందరి మాలభారిణి వృత్తాలలో కూర్చబడ్డాయి. 'ఓ హరీ!' నా ఇంద్రియాలనే గుర్రాల వేగం అపారమయినది. వివేకమనే పగ్గాలు ఎప్పుడో తెగిపోయాయి. ఇవి మదోన్మత్తాశ్వాలు. వీటిని నీ అశ్వశాలలో చేర్చుకుని వేగాన్ని తగ్గించి శీలాన్ని కల్పించు. అంటూ శ్రీహరిని కవి ప్రార్థిస్తాడు.

**5) లక్ష్మీలహరి :-** దీనిలో లక్ష్మీదేవి యొక్క సంపద్వైభవాలు ప్రస్తుతింపబడ్డాయి. ఇందులో శిఖరిణీ వృత్తంలో కూర్చబడిన 41 శ్లోకాలున్నాయి. 'అమ్మా! లక్ష్మీ! ఎవరిమీద నీకరుణాకటాక్షం ప్రసరిస్తుందో వారి జన్మ ధన్యమైపోతుంది. రంభాది సురాంగనలు మన్మథవివశలై, కేశభారం నుండి జారుతున్న పువ్వులు గలవారై అట్టి ధన్యుని వక్షఃస్థలంపై వాలిపోతారు. శంకర ప్రభృతులు వాని గుణగణాలను గానం చేస్తారు.' అంటాడు కవి లక్ష్మీలహరిలో.

**6) సుధాలహరి:-** దీనిలో స్రగ్ధరావృత్తంలో రచింపబడిన 30 శ్లోకాలున్నాయి.

ముక్కోటి దేవతలకు ప్రతిరూపమయిన సూర్యభగవానుడు స్తుతింపబడ్డాడు. ప్రస్తుత వ్యాఖ్యా విషయ మీ సుధాలహరియే.

**7) యమునా వర్ణనమ్:-** యమునా వర్ణనతో కూడిన గద్యకావ్యమో చంపూ కావ్యమో కావచ్చు. ప్రస్తుత మిది యలభ్యము. కాని దీని నుండి 2 పంక్తులు రసగంగాధరంలో ఉదహరింపబడ్డాయి.

**8) జగదాభరణము, 9) ప్రాణాభరణము:-** ఈ రెండు కావ్యాలు దాదాపు ఒకటే యనవచ్చు. ఒక దానిలో ఉదయపుర పాలకుడు జగతసింహుడు నాయకుడు కాగా, రెండవ దానిలో కామరూప పరిపాలకుడు ప్రాణ నారాయణుడు నాయకుడు. ఒకచోట 'జాగర్తు క్షితి మణ్డలోపరి జగత్సింహో ధరాధీశ్వరః' అని యుంటే, మరొక దానిలో 'జాగర్తు క్షితిమణ్డలే చిరమిహ శ్రీకామరూపేశ్వరః' అని యున్నది. ఇలాంటి చిన్న చిన్న మార్పులు తప్ప కావ్యాల్లో పెద్ద భేదాలు కనపడవు. తన కాశ్రయమిచ్చిన రాజులను వీటిలో జగన్నాథుడు ప్రస్తుతించాడు.

**10) ఆసఫ విలాసః:-** ఇది షాజహాను మామగారయిన ఆసఫ్ఖాను ప్రీతి కొరకు వ్రాయబడిన లఘు కావ్యము.

**11) భామినీ విలాసః:-** జగన్నాథుని లఘుకావ్యాల్లో ఇది ప్రశస్త తమము. దీనిని సంకలన కావ్యమనవచ్చును. జగన్నాథుడు పలు సందర్భాల్లో రచించిన ముక్తకాలను భామినీ విలాసంగా ఒకచోట చేర్చాడని భావించవచ్చు. భామినీ విలాసము 4 విలాసాలుగా విభజింపబడింది. 1) ప్రాస్తావిక విలాసము – దీనిలో 129 శ్లోకాలున్నాయి. వీనిలో అన్యోక్తులతో కూడిన వివిధ వర్ణనలున్నాయి. ఇవి భిన్న కాలాల్లో వివిధ సందర్భాల్లో రచింపబడినవి కావచ్చు. 2) శృంగార విలాసంలో స్త్రీవర్ణన ప్రణయ వర్ణనలతో కూడిన 184 శ్లోకాలున్నాయి. 4) శాన్తవిలాసంలో వివిధ దేవతలను స్తుతించిన 44 శ్లోకాలు కనపడతాయి. చాలా శ్లోకాలు భక్తిభావ ప్రపూర్ణాలు. మానవుని మనస్సుకు నిజమైన సుఖశాంతులు భగవద్భక్తి చేతనే లభిస్తాయని యిందు సూచింపబడింది. మొత్తం మీద భామినీ విలాసంలో అనేక ఛందస్సులలో వృత్తాలలో రచింపబడిన శ్లోకాలు దర్శన మిస్తాయి.

**12) చిత్ర మీమాంసా ఖండనమ్:-** అప్పయ్య దీక్షితులచే రచింపబడిన అలంకార శాస్త్ర గ్రంథము చిత్రమీమాంస. దీనిలో అనేక అర్థాలంకారాలకు సంబంధించిన చర్చ మరియు సిద్ధాంతాలున్నాయి. ఖండన గ్రంథంలో అప్పయ్య దీక్షితుని సిద్ధాంతాలను జగన్నాథుడు కణశః ఖండించాడు. ఇది అపహ్నుత్యలంకారం వరకే దొరుకుతున్నది. ఉత్ప్రేక్ష, అతిశయోక్తి అలంకారాలకు సంబంధించిన ఖండన దీనిలో కానరాదు.

**13) మనోరమాకుచమర్దనమ్:-** ఇది వ్యాకరణ గ్రంథము. భట్టోజీ దీక్షిత విరచితమైన 'ప్రౌఢమనోరమా' గ్రంథానికి ఖండన గ్రంథమనవచ్చు. ఇది స్వాది సంధ్యన్తమే లభిస్తున్నది.

ఇవి కాక జగన్నాథుడు 14) రతీమన్మథనాటకమ్, 15) వసుమతీ పరిణయమ్, 16) అల్లాఉపనిషత్తులు రచించాడని ప్రతీతి యున్నది. కాని యవి లభించుటలేదు. జగన్నాథుని రచనలలో పంచలహరులు పూర్వం రచింపబడినవనిపిస్తుంది. ఇవి కాశీ, మధుర నగరాల్లో ఉన్న కాలంలో వ్రాయబడి, కాల క్రమంలో వీనికి మరికొన్ని పద్యాలు చేర్చబడి యుండవచ్చు. వీని తర్వాత, క్రీ॥శ॥ 1641 కి ముందు, ఆసఫ విలాసం రచింపబడి ఉంటుంది. తరువాత కాలంలో 'రసగంగాధరము' 'చిత్రమీమాంసా ఖండనము' రచింపబడ్డాయి. భామినీ విలాస జగదాభరణాలు తరువాత కాలానివి కావొచ్చు. ఈ పౌర్వాపర్యక్రమం శ్రీ పుల్లెల రామచంద్రుడు మొదలగు విద్వాంసులకు సమ్మత మయినది.

**సుధాలహరి:-** జగన్నాథుడు సూర్యస్తుతిపరమయిన తనలఘుకావ్యానికి 'సుధాలహరి' యని పేరు పెట్టాడు. సుధాలహరి యంటే అమృతతరంగమని అర్థం. అమృతం బలాన్ని శక్తినీ నిర్జరత్వాన్ని అమరత్వాన్ని ప్రసాదించేదిగా ప్రసిద్ధం. సర్వేంద్రియాలకు సామూహికంగాను ప్రత్యేకంగాను తృప్తినీ ఆనందాన్ని కలిగించే శక్తిసామర్థ్యాలు అమృతానికున్నట్లు సాహిత్యప్రపంచం చాటి చెపుతున్నది. ఏ జాతి లోనయినా ఎన్నదగిన గొప్పపదార్థానికి అమృతాన్ని ఉపమానంగా చెప్పటం కవి పరంపరకు అలవాటు. కవిత్వం - అమృతోపమానం, వంటకాలు - అమృతోపమానంగా ఉన్నాయి, మొదలయిన వాక్యాలు సామాన్య జన వ్యవహారంలో కూడ కనపడతాయి. సూర్యుడు నారాయణ స్వరూపుడు

ప్రత్య క్ష దైవం విశ్వవంద్యుడు ఆరోగ్య ప్రదాత ఆశ్రిత కల్పవృక్షము, లోపల బయట వ్యాపించిన చీకట్లను తొలగించేవాడు జ్ఞానప్రదాత కాలనియామకుడు అమృతస్వరూపుడు. కనుకనే సూర్యనారాయణ మూర్తిని స్తుతించే కావ్యానికి 'సుధాలహరి' అన్న పేరు సార్థకమయింది.

ఆనందాన్నిచ్చే చల్లని వెన్నెలను చంద్రుడు ప్రసాదిస్తాడు. కనుక చంద్రుని కమృతాంశుడు సుధాంశుడు మొదలయిన పేర్లున్నాయి. సూర్యుని కనేక పేర్లున్నప్పటికీ, వానిలో సుధాంశునామంలేదు. కాని సూర్యుని కిరణాలే చంద్రునిపై ప్రతిఫలించి వెన్నెలగా పరిణామం పొందుతాయి. కనుక సుధాంశునికి సుధాంశుత్వాన్ని ప్రసాదించేవాడు సూర్యుడు. ఈ రీతిగా చూస్తే కూడ సూర్యస్తుతిని సుధాలహరిగా వ్యవహరించటం సమంజస మన్పిస్తుంది.

జగన్నాథుని కవిత సుధామయము. అంతకన్న ఆనందసంధాయకము. అతని సుధామయ కవితాతరంగమే యీ సుధాలహరీ కావ్యము. కనుక దీనికి 'సుధాలహరి' యను పేరు తగియున్నది. జగన్నాథుని గంగాలహరికి పీయూష లహరియని, యమునాలహరికి 'అమృతలహరి' యని మారు పేర్లున్నాయి. కాగా జగన్నాథుని పంచలహరుల్లో మూడింటికి అమృతమనే అర్థం వచ్చేవిధంగా పేర్లు పెట్టడం జరిగింది. దీనివల్ల జగన్నాథుని కమృతం మీదున్న యభిమానం, తన కవిత యమృతోపమ మన్న ప్రగాఢవిశ్వాసం వ్యక్త మవుతుంది. జగన్నాథుడే స్వయంగా ఒక పద్యంలో ఇలా అంటాడు. తేనె ద్రాక్షరసం అధరసుధ అమృత రసం ఆనందాన్ని కలిగించక పోవచ్చునేమో కాని తన కవిత మాత్రం తప్పక ఆనందాన్ని కల్గిస్తుంది-అని. నామాన్తరం లేకపోవటం వల్ల కావచ్చు 'సుధాలహరి' 'సుధాలహరి' గానే వ్యవహరింపబడుచున్నది.

**ఆదిత్య ప్రశస్తి:-** మానవుడు ప్రకృతి శక్తుల మహిమా ప్రాభవాలను కీర్తించటం ఆరాధించటం అనాదిగా జరుగుతున్నది. విశ్వవాఙ్మయంలో ప్రప్రథమ మనదగిన ఋగ్వేదంలో సూర్యస్తుతిపరములైన సూక్తాలనేకం దర్శన మిస్తాయి. ఋక్సూక్త సమాహారమైన 'మహాసౌరం' లో సూర్యుని గుణగణాలు వర్ణింపబడ్డాయి. యజుర్వేదానికి సంబంధించిన 'అరుణపాఠం' లో అనేక సౌరమంత్రాలు దర్శన మిస్తాయి. ఛాందోగ్యోపనిషత్తునందు సూర్యమండలాంతర్గతుడగు హిరణ్మయ పురుషుని వర్ణనమున్నది. అథర్వణవేదములోని, 'సూర్యోపనిషత్తు', కృష్ణ

యజుర్వేదము లోని 'అక్ష్యుపనిషత్తు' లు రెండూ సూర్యభగవానుని ఆరాధించే మంత్రభాగాలే. బ్రాహ్మణ క్షత్రియ వైశ్య లుపనయన సంస్కారము నొంది త్రిసంధ్యల నుపాసించు గాయత్రి సూర్యమండలాంతర్గతమైన సవితృశక్తియే. ఈ సావిత్రి సమస్త బుద్ధి శక్తులకు ప్రేరక శక్తిగా ఆరాధింపబడుతున్నది. ఆదిత్యుడు తత్తదుపాసనల మూలమున నున్నత లోకములను పొందువారికి ద్వార స్థానీయుడుగా కీర్తింపబడినాడు. ఐతరేయోపనిషత్తు నారాయణోపనిషత్తు సావిత్ర్యు పనిషత్తు మున్నగు వాని యందు సవితృప్రశంస కానవస్తుంది. ఆదికావ్యమైన శ్రీమద్రామాయణంలో రావణవధకు పూర్వం అగస్త్యమహర్షిచే శ్రీరామచంద్రుని కుపదేశింపబడిన 'ఆదిత్య హృదయమ్' సూర్యుని గుణగణాలను విపులంగా కీర్తిస్తుంది. సూర్యుడిందు సమస్త దేవతా స్వరూపుడుగ వాంఛితార్థప్రదాతగ వర్ణింపబడ్డాడు. కాళిదాసు తన యభిజ్ఞాన శాకుంతలంలో నాందీ శ్లోకంలో పరమేశ్వరుని యష్టమూర్తులలోనివారయిన సూర్యచంద్రులను కాల నియామకులుగ కీర్తిస్తాడు. ఆది శంకరులు దక్షిణామూర్తిస్తోత్రంలో సూర్యుని అహర్నాథునిగా పరమేశ్వరుని అష్టమూర్తులలో నన్యతమునిగ ప్రస్తుతిస్తారు. పరిశీలిస్తే సంస్కృత వాఙ్మయంలో సూర్యస్తుతి సన్నివేశాలు అసంఖ్యాకంగా దర్శనమిస్తాయి.

**సూర్యశతకము – సుధాలహరి:** మయూర కవి రచించిన సూర్యశతకానికి సంస్కృత సాహిత్యంలో చాలా గొప్ప స్థాన మున్నది. ఈ ఒక్క సూర్య శతకం వల్లనే మయూరుడు మహాకవుల సరసన సమున్నత పీఠాన్ని అలంకరించాడు. సంస్కృతాంధ్రకవులలో విమర్శకులలో మయూరుని సూర్యశతకాన్ని ప్రశంసించనివారు లేరు. మయూరుడు సూర్యశతకాన్ని రచించి కుష్ఠరోగం నుండి విముక్తిని పొందాడని మమ్మటుడు కావ్యప్రకాశగ్రంథంలో చెప్పాడు.

సహజంగానే వర్ణ్యవస్తువు – స్రగ్ధరావృత్తము – శబ్దాలంకార ప్రాధాన్యం – ఓజోగుణ భూయిష్ఠత – యీ అంశాలు, సూర్యశతకానికి – సుధాలహరికి సన్నిహిత సంబంధాన్ని సూచిస్తాయి. సుధాలహరిలోని శ్లోకాలను సూర్యశతకం లోనివిగా భ్రమపడటం సహజమన్పిస్తుంది. 'సంవాదాస్తు భవన్త్యేవ బాహుల్యేన మహాత్మనామ్'. అంటాడు ధ్వన్యాలోకకర్త ఆనందవర్ధనుడు. పోలికలుండటం మహాత్ముల రచనలకు సర్వసాధారణమని వారి భావన. 'గావో వః పావనానాం పర మపరిమితాం ప్రీతిముత్పాదయన్తు'. (శ్లో॥31) అని మయూరుడంటే, 'క్షేమం

తన్వన్తు తావ శ్శివమయ వపుషో వాసరేశస్య గావః' అని జగన్నాథుడు కీర్తిస్తాడు. ఉభయత్ర రవికిరణాలకు ఆవులమందలకు సామ్యమే ప్రతిపాదింపబడింది. అయినా వర్ణనలో భావ ప్రతిపాదనలో, ఎవరి ఆత్మీయతాముద్ర వారిదిగా కనపడు తుంది. పరిశీలిస్తే అనేక చోట్ల ఎన్నోపోలికలు కనిపిస్తాయి. కాని అర్థాలంకార పోషణలో భావప్రకటనలో శబ్ద విన్యాసంలో సూర్యశతక – సుధాలహరుల వేనికవే స్వతంత్ర వ్యక్తిత్వాన్ని నిలబెట్టుకుంటాయి. ఇచటి సంవాదం తుల్య దేహివత్ సంవాదమే కాని ప్రతిబింబాకార సంవాదం మాత్రం కాదు.

**సుధాలహరీ వైశిష్ట్యము:–** సుధాలహరి సూర్య స్తుతిపరమైన లఘు కావ్యము. దీనిలో స్రగ్ధరావృత్తంలో కూర్చిన 30 శ్లోకాలున్నాయి. జగన్నాథుడు సూర్యుని స్తుతించుటకు – త్రిదశులైన ముక్కోటి దేవతలకు, 30 దినములు కల మాస ప్రమాణమునకు, త్రిమూర్తులకు ముల్లోకములకు, భూత భవిష్యద్వర్తమాన రూపములగు త్రికాలములకు, రాత్రి పగలు సంధ్యల రూపాల్లో ఉన్న త్రికాలాలకు, త్రిసంధ్యలకు ప్రతినిధియనదగు త్రిదశ సంఖ్యలో శ్లోకరచన కావించినట్లు తోస్తున్నది.

**స్రగ్ధరావృత్తము:–** స్రగ్ధరావృత్తములో 21 అక్షరాలుంటాయి. అందలి 7 గణాల్లో 12 గురువులు 9 లఘువులు ఉన్నాయి. 3, 7 యతి స్థానములు. ఇందు మ, ర, భ, న, య, య, య గణములుండును. వీనిలో మ గణమునకు భూమి, ర గణమున కగ్ని, భ గణానికి చంద్రుడు, న గణమునకు నిర్జరులు, య గణమునకు నీరు, అధిదేవతలుగ చెప్పబడినారు. పరమేశ్వరుని అష్టమూర్తులే 8 గణములకు నధిదేవతలుగ చెప్పబడినారు. న గణాధి దేవతలగు నిర్జరులను కర్తృత్వశక్తికి ప్రతీకగా భావింపవచ్చును. స్రగ్ధరలో వాయు దేవతాకమగు 'స' గణమును, ఆకాశ దేవతాకమగు 'త' గణమును, సూర్యదేవతాకమగు 'జ' గణమును లేవు. పరమేశ్వరుని పంచ రూపములగు పృథివ్యాద్యధిదేవతలు స్రగ్ధరా ఛందస్సున ప్రతిష్ఠింపబడినారు. ఆకాశమున వాయువుతో కూడి సంచరించు సూర్యభగవానుడే ఇచట ప్రధానముగ వర్ణ్యుడగుటచే స్రగ్ధరావృత్తమున చేయబడిన సూర్యస్తుతి అష్టమూర్తియగు పరమేశ్వర స్తుతియని భావింపవచ్చును. స్రగ్ధరలో నున్న 12 గురువులను ద్వాదశాదిత్యులుగ సంభావింపనగును. 9 లఘువులను నవ గ్రహములకు ప్రతీకలనవచ్చును. మరల మొదటి 3 లఘువులు భూత భవిష్యద్వర్త మానములకు, చివరి 6 లఘువులు షడృతువులకు ప్రతినిధిభూతములన

వచ్చును. యతి స్థానములగు 3, 7 సంఖ్యలను పరస్పరము గుణించిన వృత్త పాదాక్షరసంఖ్య 21 వచ్చును. 21కి మూల సంఖ్య 3. సప్తసంఖ్య సూర్యాశ్వా లను, సప్తవర్ణాలను సూచిస్తుంది. ఈ విధంగా పరిశీలిస్తే ప్రధానంగా కాలనియామకుడు నక్షత్ర గ్రహ తారల కధిపతి, సర్వదేవాత్మకుడునగు సూర్య భగవానుని వర్ణనకు – దీర్ఘాక్షర బహులము. దీర్ఘసమాసములకు నోజోగుణము నకు ననుగుణము నగు స్రగ్ధరావృత్తము నెన్నుకొనుట యుక్తి యుక్త మనవచ్చును. మయూర కవియు నిట్టిభావనచేతనే కాబోలు తన సూర్యశతకమును స్రగ్ధరావృత్తముననే నిర్మించి యున్నాడు. స్రక్ అనగా పుష్పమాల. స్రగ్ధర యనగా పూలమాలను ధరించినది. ప్రశంసింపదగినదని భావము. ప్రసూన వికాసకరుడగు కమల బాంధవుని ప్రశంసించదగిన స్రగ్ధరావృత్తముతో ప్రశంసించుట మిక్కిలి ప్రశంసనీయము.

**భక్తి భావము:–** సుధాలహరిలో జగన్నాథునికి లోకబాంధవుడు ప్రత్యక్షదైవం నారాయణ స్వరూపుడునగు సూర్యునిపట్ల గల భక్తిభావం ప్రస్ఫుట మవుతుంది. ఆలంకారికులలో ననేకులు నవరస సిద్ధాంతాన్నే సమాదరించారు. మధుసూదన సరస్వతి, రూపగోస్వామి మొదలగువారు చిత్తద్రుతి, భగవదనురాగము మొదలయిన వానిని స్థాయి భావంగా చెప్పి, భక్తిరసాన్ని అంగీకరించారు. కాని చాలామంది ఆలంకారికులు గురుదేవపుత్రాది విషయక రతిని రతిభావ ధ్వనిగానే అంగీకరించారు. కాని దానికి రసత్వాన్ని అంగీకరించలేదు. కొందరు భక్తిరసము, వాత్సల్యరసము, ప్రేమరసము మొదలైన వాటిని అంగీకరించగా, ఆసంప్రదాయా లకు, అనుయాయులు కరువయ్యారు. జగన్నాథ పండితుడు కూడా రసగంగాధరం లో భక్తిరస చర్చ గావించి భక్త్యాదులను రసాలుగా అంగీకరించే కంటే భావాలుగా అంగీకరించటమే మేలని భావించాడు. కనుక సుధాలహరి భక్తి భావ ధ్వని ప్రధానమని యంగీకరించాలి. ప్రతిశ్లోకములో పాదంలో ప్రతిపదంలో కవికి సూర్యునిపట్ల గల భక్తి భావం వ్యక్తమవుతున్నది. కనుక కావ్యమంతటా పరుచు కున్నదీ ప్రధానమైనదీ భక్తి భావ ధ్వనియే. సమస్త అలంకారాలు గుణాలు రీతులూ భక్తిభావానికి అంగములే అవుతాయి.

జగన్నాథుడు తన సుధాలహరిని 'ఉల్లాసః ........... సంఘాతః కోఽపి ధామ్నామయ ముదయగిరి ప్రాన్తతః ప్రాదురాసీత్' అని ప్రారంభించాడు. సూర్యుని తేజోరాశిగా సంభావించాడు. చివరలో 'ఊర్ధ్వం పాపావలిభ్యః...... సోఽయం

సర్వాన్తరాత్మా తవ దిశతుతరాం వాసరేశ శ్శివాని' అంటూ ముగించాడు. దీనిలో వేదోపనిషత్ప్రోక్తమైన పరమ పురుష స్వరూపునిగాను సర్వాంతర్యామిగాను సకల శుభప్రదాతగాను జగన్నాథుడు సూర్యుని దర్శించాడు.

సూర్యుని గుణగణాలన్నీ సుధాలహరిలో ప్రస్తావింపబడ్డాయి. 5, 6, 16 శ్లోకాల్లో ఆశ్రితరక్షణ, 19వ శ్లోకంలో లోకక్షేమదీక్ష, 14వ శ్లోకంలో ధైర్య స్థైర్యసంధానము కీర్తింపబడ్డాయి. 19లో గ్లానిగ్రామాపహర్తగా 26లో క్లాన్తి నాశకునిగా, 27లో ప్రయాసాపహర్తగా, 10లో ఆశాపాశాపహర్తగా 3, 22 లలో అఘనాశకునిగ, 13లో మాంద్యోన్మూలకునిగా, 20, 25లలో అవిద్యా నాశకునిగా సూర్యభగవానుడు కీర్తింపబడ్డాడు. ఈవిధంగా శిష్ట రక్షణ, దుష్ట శిక్షణ అనే భగవల్లక్షణాలు సూర్యునియందు ప్రతిపాదింపబడ్డాయి. 'ఆరోగ్యం భాస్కరాదిచ్ఛేత్' అను సూక్తి కనుగుణంగా 28 లో హృద్రోగనాశకునిగా, 29లో పాండుతానాశకునిగా, అనేకచోట్ల రోగాపహర్తగ సూర్యుడు ప్రశంసింపబడ్డాడు. సూర్యుని ప్రధానగుణమగు కాలనియామకత్వము 21వ శ్లోకంలో ప్రస్తుతించ బడ్డది. సందర్భానుగుణంగా కారుణికత్వం పరోపకార పరాయణత్వం, విజయ ప్రదాయకత్వం ప్రతిపాదింపబడ్డాయి. 2, 4, 7, 12, 23, 30 శ్లోకాలలో సూర్యభగవానుడు సర్వమంగళప్రదాతగా సంభావింపబడ్డాడు. 15, 30 శ్లోకాలలో సూర్యుడు దేవతాస్వరూపునిగా సూర్యనారాయణునిగా సంభావింప బడ్డాడు. మొత్తం మీద సుధాలహరిలోని ప్రత్యక్షరము సూర్యభగవానుని కీర్తిపతాకగా దర్శనమిస్తుంది. స్థూలంగా చూస్తే 1 నుండి 10 శ్లోకాల వరకు సూర్యకిరణ ప్రశంస కనపడుతుంది. 11 నుండి 30 వరకు శ్లోకాలలో వివిధ దుఃఖాలను, రోగాలను తొలగించవలసిందిగా శుభాలను ప్రసాదించవలసిందిగా కవి చేసే ప్రార్థన గోచరిస్తుంది.

జగన్నాథుని శబ్దాలంకార ప్రియత్వం సుధాలహరిలో తాండవిస్తుంది. అనుప్రాసయమకాల కగ్రతాంబూల మిచ్చినట్లు కనపడుతుంది. ఓజో గుణానికి దీర్ఘ సమాసాలకు కొదవలేదు. సూర్యుని ప్రచండత్వాన్ని స్ఫురింపచేయడానికి జగన్నాథుడీ పద్ధతినాశ్రయించి యుంటాడు. దీనికనుగుణంగానే కఠిన వర్ణాలను సంయుక్తాక్షరాలను విరివిగావాడి, గౌడీరీతికి పెద్దపీట వేయడం జరిగింది. ప్రసాద గుణానికి అర్థస్ఫూర్తికి లోటురానివిధంగా సాగిన రచనాశైలి జగన్నాథుని ధారాశుద్ధికి ప్రతిభా వైశద్యానికి దర్పణం పడుతుంది. దీనిలో ఉపమ, ఉత్ప్రేక్ష,

రూపకం, శ్లేష, సహోక్తి, స్వభావోక్తి, పరికరం, పరికరాఙ్కురం, భ్రాంతిమదా ద్యర్థాలంకారాలు విరివిగా దర్శనమిస్తాయి. భక్తిభావధ్వనికి శబ్దార్థాలంకారాలు పోషకములని భావించినప్పటికీ కొన్నిచోట్ల శబ్దార్థాలంకారాలే ప్రభుత వహించటం కానవస్తుంది.

**పావనీవ్యాఖ్య:-** పావనీ అంటే పవిత్రం చేసేది అని అర్థము. సూర్యభగవాను డాదిత్య హృదయంలో సర్వదేవాత్మకునిగా కీర్తించబడ్డాడు. ఉపనిషత్తులు సూర్యుని పాపావలి కతీతునిగా కీర్తించాయి. కనుక సూర్యనారాయణుడు లోక పావనుడనటానికి సందేహం లేదు. కావ్యం పేరు సుధాలహరి. అమృతం పరమపావనం కదా? వర్ణ్యవస్తుగతమైన పావనత్వం తదాశ్రితులకు సంక్రమించటం పరిపాటి. శ్రీహర్షుడు తన నైషధకావ్య ప్రారంభంలో నల దమయంతుల కథ లోకపావనమని, దానినాశ్రయించిన తన కవితను కూడ అది పవిత్రం చేస్తుందని భావిస్తాడు. కనుక నా ఈ వ్యాఖ్య ముందుగా పావనత్వాన్ని పొంది సహృదయులను కూడా పవిత్రులను చేయాలని ఆకాంక్ష. సామాన్య పాఠకులను దృష్టిలో ఉంచుకొని, వ్యాఖ్య సందర్భంలో అరసున్నాలు, అలు, క్లిష్టసంధులు వీలైనంతవరకు పరిహరించబడ్డాయి. కొన్నిచోట్ల అర్థ స్ఫుటత కొరకు విసంధిచేయబడింది.

**ధన్యవాదాలు:-** జగన్మాతకు నమస్కరించాలన్నా స్తుతించాలన్నా ఎంతో పుణ్యం చేసుకుని ఉండాలి-అంటారు ఆదిశంకరులు. ఆర్ష సంస్కృతి పట్ల శ్రీ రావిమోహనరావు గారికున్న అవ్యాజానురాగానికి సుధాలహరీ ప్రచురణ యొక నవ తార్కాణము. సూర్యానుగ్రహసిద్ధిరస్తు. పదేపదే గ్రంథరచనకు ప్రోత్సహించిన డా॥ తాళ్ళూరి ఆంజనేయులు గార్కి, మాన్యమిత్రులు శ్రీ మేళ్ళచెర్వు వేఙ్కట సుబ్రహ్మణ్యశాస్త్రి గార్కి, నిర్దోషంగా ప్రచురించిన విక్రమ్ గ్రాఫిక్స్ వారికి ధన్యవాదాలు. గుణగ్రహణపారీణులయిన సహృదయ పాఠకులు మానవ సహజాతాలైన తప్పిదాలను మన్నిస్తారని ఆశిస్తాను.

లోకాస్సమస్తాస్సుఖినోభవన్తు.

– డా॥ ఈమని వేఙ్కట సత్యనారాయణమూర్తి
రీడర్ – సంస్కృత విభాగము
శ్రీ గోరంట్ల వెంకన్న సంస్కృత కళాశాల, తిమ్మసముద్రం

## అక్షరాఞ్జలిః

సూర్యసూక్తమిదం పుణ్యం ఋగ్వేద ప్రథితం హితమ్।
కుత్సదృష్టం శుభం సౌరం త్రిష్టుభా పరికీర్తితమ్।। 1

సర్వదేవాత్మక స్సూర్య స్తేజస్వీ లోకపావనః।
తస్యానుగ్రహ మాత్రేణ లభ్యాభూతిః సదాశుభా।। 2

సుధాస్తిలహరీరూపా జగన్నాథేన నిర్మితా।
సూర్యస్తుతిపరాభవ్యా చేహాముత్రఫలప్రదా।। 3

సత్యనారాయణ ప్రోక్తా ఆంధ్రభాషాత్మికాశుభా।
జీయాదియం పరావ్యాఖ్యా 'పావనీ' లోక సంస్తుతా।। 4

పవనస్యాత్మజః పూజ్యః అఞ్జనానన్ద వర్ధనః।
పావనిః 'పావనీం' వ్యాఖ్యాం పుష్ణాతు పరితస్సదా।। 5

ఆర్ష సంస్కృతి సంసక్తః గ్రంథప్రచురణోద్యతః।
రావి మోహనరాయోఽయం సుఖం శాన్తిఞ్చ విన్దతామ్।। 6

17

శ్రీః

# ఋగ్వేద సూర్య సూక్తమ్

## పావనీ వ్యాఖ్య

## ఈమని వేఙ్కట సత్యనారాయణమూర్తి

ఋగ్వేదమున మొదటి మణ్డలమునందు 115వ సూక్తము.సూర్యసూక్తము. ఇందు సూర్యదేవతాకములైన త్రిష్టుప్ఛందములోకల 6 మంత్రములున్నవి. ఈ సూర్యసూక్తమునకు మంత్రద్రష్ట కుత్సమహర్షి. వీనికి సౌర్యపశు విషయముననుు, అతిమూర్తి నామకమగు ఏకాహమునందు శునాశీర్యపర్వము నను ఉపయోగమున్నట్లు సాయణభాష్యమున కలదు.

**అవతారిక:**-సర్వభూతాన్తరాత్మ నిఖిల దేవతాస్వరూపుడు విశ్వవ్యాప్తతేజుడు సూర్య భగవానుడిచట ప్రస్తుతింపబడినాడు.

శ్లో॥ చిత్రం దేవానాముదగాదనీకం
చక్షుర్మిత్రస్య వరుణస్యాగ్నేః।
ఆప్రా ద్యావాపృథివీ అన్తరిక్షం
సూర్య ఆత్మా జగతస్తస్థుషశ్చ॥ 1

**పదవిభాగము:**- చిత్రమ్-దేవానామ్-ఉదగాత్-అనీకమ్-చక్షుః-మిత్రస్య-వరుణస్య-అగ్నేః-ఆ-అప్రాః-ద్యావాపృథివీ-ఇతి-అన్తరిక్షమ్-సూర్యః-ఆత్మా-జగతః-తస్థుషః-చ.

**అన్వయము:**- దేవానామ్ అనీకమ్ చిత్రమ్ మిత్రస్య వరుణస్య అగ్నేః చక్షుః సూర్యః ఉదగాత్। ద్యావాపృథివీ అన్తరిక్షమ్ ఆ అప్రాః। జగతః తస్థుషః చ ఆత్మా

**ప్రతిపదార్థము:**-దేవానామ్=ప్రకాశమానములగు రశ్ములకు, దేవతలకు, అనీకమ్ =సమూహరూపమగు, చిత్రమ్=ఆశ్చర్యమును కలిగించునది, మిత్రస్య=మిత్రునికి, వరుణస్య=వరుణునకు,అగ్నేః=అగ్నికి,(అనగా సమస్త ప్రపంచమునకు) చక్షుః =నేత్రమైన, సూర్యః=సూర్యుడు, ఉదగాత్=ఉదయించెను, ద్యావాపృథివీ= స్వర్గమును భూమిని, అన్తరిక్షమ్=ఆకాశమును, ఆ అప్రాః=అంతట(తన తేజస్సు తో) నింపెను, జగతః=గమనశీలము కలవానికి, తస్థుషః =కదలకయుండు వానికి, (అనగా సమస్త విశ్వమునకు) చ=కూడా, ఆత్మా= కారణము, జీవాత్మ.

**తాత్పర్యము:–** మిత్రవరుణాలగ్నులకు సమస్త జగత్తునకు నేత్రమువలె సమస్త పదార్థములను చూపించు సూర్యుడుదయించెను. అతని రూపమాశ్చర్యకరమగు కాంతి సమూహము. అతడు సర్వదేవాత్మకుడు మరియు ఆశ్చర్యమును కల్గించు వాడు. అతడుదయించుట తోడనే భూలోక స్వర్లోకములను అన్తరిక్షమును తన తేజస్సులతో ప్రకాశింప చేసెను. స్థావర జంగమాత్మకమగు జగత్తునకతడే మూల కారణము. సర్వ హృదయాన్తర్యామియయిన జీవాత్మయతడే.

**విశేషములు:–** 1)సూర్యమండలాంతర్గతుడగు పరమ పురుషుడు సర్వాంతర్యామి. చరాచరమున హృదయాంతర్వర్తియై ఆయా ప్రేరణలను కలుగచేయువాడు. అతని నుండియే సమస్త ప్రపంచము పుట్టినది కావున కార్యమగుజగత్తు కారణమగు పరమాత్మునికన్న భిన్నము కాదు. కనుక చరాచరజగత్తునకు ముఖ్యరూపమతడే. రాత్రివేళల నిద్రాదులచే మృతప్రాయమైన ప్రాణి జాతము యొక్క చైతన్యము నుద్దీపింప చేయువాడు కావున ప్రాణులకితడే ముఖ్య ప్రేరకుడు. కనుకనే తైత్తిరీ యారణ్యకమున (1-14-1) 'యోఽసౌ తపన్నుదేతి ససర్వేషాం భూతానాం ప్రాణానాథాయోదేతి' అని చెప్పబడినది. 2) గ్రుడ్డివాడు పదార్థములను చూడలేడు. కన్నులున్ననూ కాంతిలేనిచో వస్తువులను కాంచలేము. కన్ను చూచుటకెట్లు సాధనమో కాంతియు అట్లే చూచుటకు సాధనము. కనుకనే సూర్యుడు జగత్తునకు నేత్రమని రూపకముచే చెప్పబడినాడు. 3) దేవ శబ్దమునకు ప్రకాశించువారని యర్థము. దేవతలు రశ్మలు రెండును ప్రకాశించునవే. కనుక సూర్యుడు దేవాత్మకుడు ప్రకాశ స్వరూపుడునని వర్ణింపబడినాడు.

**వ్యాకరణాంశములు:–**

**ఉదగాత్** = ఉత్ ఉపసర్గ, ఇణ్ ధాతువునకు గమనమర్థము, లజ్ లకారము భూతకాల వాచకము. దీనికి ప్రథమపురుష ఏకవచనమున ఉదగాత్ అని రూపముండును.

**అప్రాః** = ప్రా ధాతువునకు పూరించుటయని యర్థము. మధ్యమ పురుష ఏక వచనమున అప్రాః అని రూపముండును. ఇది ఇచట ప్రథమ పురుషార్థమున ప్రయోగింపబడినది.

సూర్యః = సృ ధాతువునకు గమనమర్థము. గమనము చేయువాడు లేదా, గమనమును చేయించువాడు అను అర్థమున క్యప్ ప్రత్యయము రాగా రూపమేర్పడును.

జగత్ = గమ్ ధాతువునకు వెళ్ళుటయని యర్థము,దానిపై క్విప్ ప్రత్యయము చేయగా ధాతువునకు ద్విత్వము వచ్చినది. చలించునది=జంగమ మని యర్థము.

తస్థుషః = (ష్ఠా) స్థా ధాతువునకు గమనములేనిదని యర్థము. దీనిపై క్వసు ప్రత్యయము చేయగా ద్విత్వము వచ్చినది. కదలనిది=స్థావరము.

**అవతారిక:-** యువకుడు యువతి ననుసరించినట్లు ఉషోదేవి ననుసరించి సూర్యుడుదయించుచున్నాడు. కల్యాణార్థులతని నుపాసించుచున్నారని యిచట వర్ణింపబడుచున్నది.

శ్లో॥ సూర్యో దేవీ ముషసం రోచమానాం
మర్యో న యోషామభ్యేతి పశ్చాత్।
యత్రా నరో దేవయన్తో యుగాని
వితన్వతే ప్రతి భద్రాయ భద్రమ్॥ 2

**పదవిభాగము:**-సూర్యః-దేవీమ్-ఉషసమ్-రోచమానామ్-మర్యః-న-యోషామ్-అభి-ఏతి-పశ్చాత్-యత్ర-నరః-దేవయన్తః-యుగాని-వితన్వతే-ప్రతి-భద్రాయ-భద్రమ్.

**అన్వయము:-** సూర్యః దేవీమ్ రోచమానామ్ ఉషసమ్ పశ్చాత్ అభ్యేతి మర్యః యోషామ్ న। యత్ర దేవయన్తః నరః ప్రతిభద్రాయ భద్రమ్ యుగాని వితన్వతే.

**ప్రతిపదార్థము:-** సూర్యః=ఆదిత్యుడు, దేవీమ్=దానాది గుణములుకల, రోచమానామ్=ప్రకాశించుచున్న, ఉషసమ్=ఉషస్సునుదేవిని, పశ్చాత్=అనుసరించి, అభ్యేతి=వెళ్ళుచున్నాడు,మర్యః=మానవుడు, యోషాం న=యువతిననుసరించినట్లు, యత్ర=ఉషోదయము కాగానే, దేవయన్తః=సూర్యునారాధింపదలచిన, సూర్యానుగ్రహమును పొందగోరిన, నరః=మనుష్యుడు, ప్రతిభద్రాయ=కళ్యాణరూపమగు కర్మఫలము కొరకు, భద్రమ్=అప్రమత్తముగ, యుగాని=ఆయా కాలములందు చేయదగిన దర్శపూర్ణమాసాదులను, వితన్వతే=విస్తరింపచేయుచున్నాడు.

**తాత్పర్యము:**-యువకుడు సౌందర్యాది గుణసంపన్నయగు యువతి ననుసరించి నట్లు, దానాది గుణములతో ప్రకాశించుచున్న యుషోదేవిని సూర్యుడనుసరించు చున్నాడు. ఉషోదయమగుటతోడనే శుభఫలములనాశించిన, సూర్యానుగ్రహమును కోరిన యజమాను లప్రమత్తముగ దర్శపూర్ణమాసాది కర్మలను విస్తరింపచేయు చున్నారు.

**విశేషములు:**-1) దేవయన్తః యుగాని అనుపదములను సాయణాచార్యులవారు పలువిధముల వ్యాఖ్యానించియున్నారు. (అ) సూర్యునర్చింపగోరిన యజమానులు దర్శపూర్ణమాసాదులను విస్తరింపచేయుచున్నారు. (ఆ) యజ్ఞాదులనాచరించుటకు ధనార్థులైన యజమానులు వ్యవసాయపు పనిముట్లను భూమి దున్నుట యందు ప్రవర్తింపచేయుచున్నారు. (ఇ) దేవత్వమునందగోరు యజమానులు పత్నీ సహితులై యగ్నిహోత్రాదికర్మల నాచరించుచున్నారు.

**వ్యాకరణాంశములు:**-

**మర్యః** = **మృజ్** అను ధాతువునకు ప్రాణములను విడుచుటయని అర్థము. దీనిపై యత్ ప్రత్యయమును చేయగా ఏర్పడిన రూపము. వేద మాత్ర ప్రయుక్తము. లోకమున నిట్టి ప్రయోగము కానరాదు.

**దేవయన్తః** = దేవుని తనకు కావలెనని కోరుచున్నాడు-అనునర్థమున క్యచ్ ప్రత్యయము చేయగా నేర్పడినరూపము.

**యుగాని** = **యుజిర్** ధాతువునకు యోగమని యర్థము. దీనిపై **ఘఞ్** ప్రత్యయము చేయగా నేర్పడిన రూపము. వేదము కావున గుణము రాలేదు.

మర్యః,యోషా,దేవయన్తః, అనునవి వైదిక ప్రయోగములు. మర్త్యః యోషిత్ దేవీయన్తః అనునవి సదృశములైన భాషా ప్రయోగములు.

**వితన్వతే** = వి అనునది ఉపసర్గ, **తన్** ధాతువునకు విస్తరించుటయని అర్థము. లట్ ప్రథమ పురుష బహువచనము.

**అవతారిక:**- కల్యాణ స్వరూపములగు సూర్యాశ్వముల మరియు సూర్యరశ్ముల వర్ణన మిందు మనోహరముగ చేయబడినది.

**శ్లో॥** **భద్రా అశ్వా హరితః సూర్యస్య**
**చిత్రా ఏతగ్వా అనుమాద్యాసః**

నమస్యన్తో దివ ఆ పృష్ఠమస్థుః
పరి ద్యావాపృథివీ యన్తి సద్యః॥ 3

**పదవిభాగము:**– భద్రాః–అశ్వాః–హరితః–సూర్యస్య–చిత్రాః–ఏతగ్వాః–అనుమాద్యాసః–నమస్యన్తః–దివః–ఆ–పృష్ఠమ్–అస్థుః–పరి–ద్యావాపృథివీ–ఇతి–యన్తి –సద్యః।

**అన్వయము:**– భద్రాః చిత్రాః ఏతగ్వాః అనుమాద్యాసః హరితః సూర్యస్య అశ్వాః నమస్యన్తః దివః పృష్ఠమ్ ఆ అస్థుః। సద్యః ద్యావాపృథివీ పరియన్తి।

**ప్రతిపదార్థము:**–భద్రాః=కల్యాణ స్వరూపములు, చిత్రాః=విచిత్రావయవములతో నొప్పునవి, చిత్రవర్ణములు కలవి, నీలవర్ణములైనవి, ఏతగ్వాః=గమనశీలములు, అనుమాద్యాసః=అందరిచే ప్రశంసింపదగినవి, హరితః=మోయునవి, రసమును హరించునవి, పచ్చని వర్ణము కలవి, సూర్యస్య=సూర్యుని యొక్క, అశ్వాః= తురగములు, వ్యాపించునవగురశ్ములు, నమస్యన్తః=మనచే నమస్కరింపబడు చున్నవై, దివః=అన్తరిక్షము యొక్క, పృష్ఠమ్=తూరుపుభాగమును, ఆ అస్థుః= పొందుచున్నవి. సద్యః=వెంటనే, ద్యావాపృథివీ=భూమ్యన్తరిక్షములను, పరియన్తి =అంతట వ్యాపించుచున్నవి.

**తాత్పర్యము:**– కల్యాణ స్వరూపములు, చిత్రవర్ణములతో విచిత్రావయవములతో కూడినవి, శీఘ్రప్రయాణ శీలములు, సర్వులచే ప్రశంసింపదగినవి. హరిత్తులను పేరుగల సూర్యాశ్వములు, అందరిచే నమస్కరింపబడుచున్నవై అంతరిక్షమున తూరుపు భాగమునందు ప్రకాశించుచున్నవి. అవి వెంటనే భూమ్యంతరిక్షము లందు వ్యాపించుచున్నవి. రసములను హరించు స్వభావముకల సూర్యుని కిరణములు వ్యాపించుచున్నవనియును చెప్పనగును.

**విశేషములు:**– 1) ఇచట అశ్వాః, హరితః, చిత్రాః, ఏతగ్వాః అనుపదములకు సాయణాచార్యులు అనేకార్థములను చెప్పి అశ్వపరకముగను, కిరణపరకముగను రెండు అర్థములను సాధించిరి. అశ్వాః=తురగములు, వ్యాపనశీలములు, హరితః=మోయునవి, హరితవర్ణము కలవి, హరిత్తులను పేరు కలవి, చిత్రాః =విచిత్రావయవములు కలవి, చిత్రవర్ణములైనవి, ఏతగ్వాః=శీఘ్రగమన

శీలములు, తురగములు. 2) హరితః అనుపదమునకు జలహరణశీలములు అనునర్థము కూడ చెప్పిరి. నీటిని హరించి మేఘరూపమున వృష్టికుపకరించు రశ్మిలిచట గ్రాహ్యములు.

**వ్యాకరణాంశములు:-**

**అశ్వాః** = **అశ్** ధాతువునకు వ్యాపించుట యర్థము. దీనిపై 'క్వన్' ప్రత్యయముచే రూపమేర్పడినది.

**ఏతగ్వాః** = గమనమర్థముగా కల **'ఇణ్'** ధాతువు మీద **'తన్'** ప్రత్యయము చేయగా ఏతశబ్దము సిద్ధించును, 'గమ్' ధాతువు మీద ఔణాదిక మగు 'ద్వ' ప్రత్యయము చేయగా 'గ్వ' అని ఏర్పడును. మార్గమును గమించునవి=శీఘ్రగమన శీలములు అని యర్థము.

**అనుమాద్యాసః** = **అను** అనునది ఉపసర్గము, **మత్** ధాతువు స్తుత్యర్థకము, దీనిపై ప్రేరణార్థమున **'ణిచ్'** ప్రత్యయమును దానిపై **యత్** ప్రత్యయమును చేయగా **'అనుమాద్య'** అగును. ప్రథమ బహు వచనమున **అనుమాద్యాసః** అని రూపముండును.

**నమస్యన్తః**= **నమ** శ్శబ్దముపై పూజార్థమున **క్యచ్** ప్రత్యయము చేసి, దానిపై కర్మార్థమున **'శతృ'** ప్రత్యయము చేయగా నేర్పడిన రూపము.

**అస్థుః** = **స్థా** ధాతువునకు లుఙ్ ప్రథమపురుష బహువచనము. **'లట్'** లకారార్థమున **'లుఙ్'** లకారము ప్రయోగింపబడినది.

**అవతారిక:-** సూర్యుని సర్వస్వాతంత్ర్య మిచట దేవత్వమును మహత్వమును సంపాదించెడి గొప్పశక్తిగా వర్ణింపబడినది.

**శ్లో॥** **తత్సూర్యస్య దేవత్వం తన్మహిత్వం**
**మధ్యా కర్తోర్వితతం సం జభార।**
**యదేదయుక్త హరితః సధస్థా**
**దాద్రాత్రీ వాసస్తనుతే సిమస్మై॥** 4

**పదవిభాగము:-** తత్-సూర్యస్య-దేవఽ త్వమ్-తత-మహిఽ త్వమ్-మధ్యా-కర్తోః-విఽ తతమ్-సమ్-జభార-యదా-ఇత్-అయుక్త-హరితః-సధఽ స్థాత్ -ఆత్-రాత్రీ-వాసః-తనుతే-సిమస్మై॥

**అన్వయము:-** సూర్యస్య తత్ దేవత్వమ్ తత్ మహిత్వమ్ కర్తోః మధ్యా వితతమ్ సమ్ జభార। యదా ఇత్ హరితః సధస్థాత్ అయుక్త ఆత్ రాత్రీ సిమస్మై వాసః తనుతే.

**ప్రతిపదార్థము:-** సూర్యస్య=ఆదిత్యుని యొక్క, తత్=సర్వప్రేరకత్వరూపమగు ధర్మమే, దేవత్వమ్=ఈశ్వరత్వము, స్వాతంత్ర్యమనియర్థము, తత్=అదియే, మహిత్వమ్=మాహాత్మ్యము, గొప్పదనము, కర్తోః=ప్రారంభించబడి ఇంకను ముగియని పని యొక్క, మధ్యా=మధ్యముననే, (ముగియకుండగనే), వితతమ్=అంతటను వ్యాపించిన (తన కిరణజాలమును), సమ్‌జభార=ఈలోకమునుండి యుపసంహరించెను. యదా ఇత్=ఏకాలమునందు, హరితః=రసహరణ శీలము లయినరశ్మలను,(హరిత్తులనబడెడు అశ్వములను) సధస్థాత్=భూలోకమునుండి, అయుక్త=(ఉపసంహరించి)మరియొక ప్రదేశమున కూర్చుచున్నాడో, ఆత్=వెను వెంటనే, రాత్రీ=నిశ, సిమస్మై=సమస్త లోకమునందు, వాసః=కప్పివేయు స్వభావముకల (చీకటిని) తనుతే=విస్తరింపచేయుచున్నాడు.

**తాత్పర్యము-** సూర్యుడు కిరణములను వ్యాపింపచేయుట యందు, ఉప సంహరించుట యందు సర్వస్వతంత్రుడు. తన ఇచ్ఛననుసరించియే లోకము నాయా కర్మలయందు ప్రేరేపించును. ఇట్టి స్వాతంత్ర్యము సూర్యునికి మాత్రమే కలదు. అన్యులకు లేదు. కనుకనే సూర్యుడు తన రశ్మలను లేదా అశ్వముల నీలోకమునుండి యుపసంహరించిన వెంటనే జనులు తాము ప్రారంభించిన కృష్యాది కార్యములు సమాప్తినొందనప్పటికీ పనులను విరమించెదరు. సూర్యుడు తన రశ్మలనుపసంహరింపగనే రాత్రి సర్వలోకముల నాచ్ఛాదించు చీకట్లను వ్యాపింపచేయును. ఇచట సూర్యుడొక్కడే స్వతంత్రుడు. జనులు రాత్రి పగలు సూర్యుననుసరించియే తమపనుల నుండి విరమించుటనుగాని, ప్రారంభించుట గాని చేయుచుందురు. ఇదియే సూర్యునియందున్న దేవత్వము. ఇదియే యాతని మహత్త్వము.

**విశేషములు:-** 1) సధస్థాత్ అనుపదమునకు భూలోకము నుండి యనియు, రథము నుండి యనియు అర్థము. అయుక్త అనగా మరియొక చోట కూర్చెను అనియు. విడిచిపెట్టెననియు అర్థము. సూర్యుడు తనరశ్మలను లేదా తురగములను మరియొకచోట నియమించెను అనునది మొదటి యర్థము,

తన రథాశ్వములను విడిచి పుచ్చెను అనునది రెండవ యర్థము, దీనివలన స్ఫురించును. 2) వాసః అనుపదమునకు ఆచ్ఛాదించునది, అనియు, వాసర మనియు అర్థము కలదు.

**వ్యాకరణాంశములు:-**

**మహిత్వమ్** = మహ+ఇన్+త్వ,

**మధ్యా** = సప్తమ్యే కవచన రూపము వేదమునందే కాననగును,

**కర్తోః** = కృ+తున్=కర్తృ, షష్ఠ్యేకవచనరూపము,

**వితతమ్** = వి+తన్+క్త,

**జభార** = హృ+లిట్ ప్రథమైక వచనము, 'హృగ్రహోర్భశ్ఛన్దసి' అను సూత్రముచే 'హ' కు 'భ' ఆదేశము వచ్చినది,

**అయుక్త** = యుజిర్+లుజ్ ప్రథమ పురుష ఏకవచనము న+యుక్త =అయుక్త,

**సధస్థాత్** = సహ+స్థా+క-'సధమాధస్థయో శ్ఛన్దసి' అనుసూత్రముచే సహకు 'సధ' ఆదేశము వచ్చినది. మధ్యా, కర్తోః, జభార, అయుక్త, ఇత్, సధస్థాత్, ఆత్, సిమస్మై ఇవి యన్నియు వేదమున మాత్రమే ప్రయుక్తములు. వీనికి లోకమున ప్రయోగము లేదు.

**అవతారిక:-** సూర్యుడు పగటివేళల శుక్లకాంతులను రాత్రివేళల కృష్ణ కాంతులను ప్రసరింపచేయుచు విశ్వమందు తన యసాధారణత్వమును ప్రకటించుచున్నాడని యిచట వర్ణింపబడుచున్నది.

**శ్లో॥** తన్మిత్రస్య వరుణస్యాభిచక్షే సూర్యో
రూపం కృణుతే ద్యోరుపస్థే।
అనన్త మన్యద్రుశదస్య పాజః
కృష్ణ మన్యద్ధరితః సం భరన్తి॥ 5

**పదవిభాగము:-** తత్-మిత్రస్య-వరుణస్య-అభి_చక్షే-సూర్యః-రూపమ్-కృణుతే -ద్యోః-ఉప_స్థే-అనన్తమ్-అన్యత్-రుశత్-అస్య-పాజః-కృష్ణమ్-అన్యత్- హరితః-సమ్-భరన్తి।

**అన్వయము:-** తత్ మిత్రస్య వరుణస్య అభిచక్షే సూర్యః ద్యోః ఉపస్థే రూపమ్ కృణుతే। అస్య హరితః అన్యత్ అనన్తమ్ రుశత్ పాజః సమ్ భరన్తి, అన్యత్ కృష్ణమ్।

**ప్రతిపదార్థము:-** తత్=అప్పుడు అనగా ఉదయకాలమున, మిత్రస్య+వరుణస్య=మిత్రావరుణులచే సూచింపబడిన సమస్తజగత్తును అభిచక్షే=అభిముఖముగ ప్రకాశింపచేయుటకు, సూర్యః=సర్వప్రేరకుడగు సవిత, ద్యోః=ఆకాశముయొక్క ఉపస్థే=సమీపస్థానమున=మధ్యభాగమున, రూపమ్=ప్రకాశకమగు తేజస్సును, కృణుతే=చేయుచున్నాడు, అస్య=సూర్యునియొక్క హరితః=రసహరణశీలములగు రశ్మలు,హరిద్వర్ణములగు అశ్వములు, అన్యత్=చీకటి కంటె విలక్షణములయిన, అనన్తమ్=అంతులేని, రుశత్=దేదీప్యమానమగు, పాజః=బలముకల తేజమును, సమ్భరన్తి=(పగలు తమ యాగమనముచే) పుట్టించుచున్నవి, అన్యత్=(తాము తొలగుటచే రాత్రి వేళలందు) చీకటిని, కృష్ణమ్=నల్లని వర్ణముకల దానిని (పుట్టించుచున్నవి).

**తాత్పర్యము:-** ఉదయ సమయమున సమస్తలోక ప్రేరకుడగు సూర్యుడు విశ్వమును ప్రకాశింప చేయుటకు ఆకాశమధ్యముననున్నవాడై చీకట్ల నన్నింటినీ పోగొట్టగల బలయుక్తములయిన కాంతులను ప్రసరింపజేయుచున్నాడు. ఈ రసహరణములైన సూర్యరశ్మలు-హరి దశ్వములు అనన్తమగు దేదీప్యమానమైన తేజస్సును, చీకట్లను పోగొట్టు విలక్షణమయిన దానిని, పగటి వేళ వ్యాపింప చేయుచున్నవి. రాత్రివేళల మరల అతివిలక్షణములగు కృష్ణకాంతులను ప్రసరించుచున్నవి.

**విశేషములు:-** 1) మిత్రవరుణ శబ్దములు క్రమముగ సూర్యచంద్రులను బోధించును. వీరు బలమును రసమును ప్రసాదించుచుందురు. ఈవిధముగ మిత్రావరుణ శబ్దములు వేదమున విశ్వమంతటిని వ్యక్తీకరించునవిగా తరచు వాడబడుచున్నవి. 2) రవి కిరణములే అహోరాత్రములను సృష్టించునను విషయ మీమంత్రమున స్పష్టము చేయబడినది. పగలు తమ కాంతిప్రసారముచే శుక్ల కాంతులను, రాత్రి వానినుపసంహరించుటచే కృష్ణకాంతులను ప్రసారము చేయునవి సూర్యరశ్మలేయని భావము.

**వ్యాకరణాంశములు:-**

**అభి చక్షే** = అభి అను ఉపసర్గ పూర్వమందున్న చక్ష్ ధాతువు మీద భావార్థమున క్విప్ ప్రత్యయము చేయగా చతుర్థీ ఏకవచనమున అభిచక్షే అని రూపము.

**ఉపస్థే** = ఉపపూర్వక **స్థా** ధాతువునకు **ఘఞ్** అర్థమున క ప్రత్యయము చేయగా నేర్పడిన రూపము.

**పాజః** = రక్షణార్థకమగు **పా** ధాతువు మీద **అసున్** ప్రత్యయముచేయగా **'పాతేర్బలేజుట్'** అని జుడాగమము రాగా నేర్పడిన రూపము. తనను తనవారిని రక్షించునది. కావున బలమని యర్థము.

**రుశత్** = **రుశ్** దీప్తౌ అను ధాతువుపై శతృప్రత్యయము చేయగా నేర్పడిన రూపము.

**భరన్తి** = భృ ధాతువునకు లట్ ప్రథమ పురుష బహువచన రూపము.

**అవతారిక:-** పాపములనుండి నింద్యకర్మములనుండి జనులను సూర్యరశ్మిలు రక్షింపజాలునను విశ్వాసమిందు ప్రముఖముగ ప్రస్తావింపబడినది.

**శ్లో॥ అద్యా దేవా ఉదితా సూర్యస్య**
**నిరంహసః పిపృతా నిరవద్యాత్।**
**తన్నో మిత్రో వరుణో మామహన్తా**
**మదితిః సిన్ధుః పృథివీ ఉత ద్యౌః॥ 6**

**పదవిభాగము:-** అద్య-దేవాః-ఉత్౨ ఇతా-సూర్యస్య-నిః-అంహసః-పిపృత-నిః-అవద్యాత్-తత్-నః-మిత్రః-వరుణః-మామహన్తామ్-అదితిః-సిన్ధుః-పృథివీ -ఉత-ద్యౌః॥

**అన్వయము:-** దేవాః అద్య సూర్యస్య ఉదితా అంహసః నిష్పిపృత అవద్యాత్ నిః నః తత్ మిత్రః వరుణః అదితిః సిన్ధుః పృథివీ ఉత ద్యౌః మామహన్తామ్॥

**ప్రతిపదార్థము:-** దేవాః=ప్రకాశించు సూర్యరశ్మిలారా!, అద్య=ఈదినమున, సూర్యస్య=ఆదిత్యునియొక్క ఉదితా=ఉదయము ఏర్పడగా,(అటునిటు ప్రసరించు చున్న మీరు) (మమ్ములను) అంహసః=పాపమునుండి, నిష్పిపృత= నివారించి రక్షణ చేయుడు, అవద్యాత్=నింద్యకర్మములనుండి, నిః=నివారించి రక్షణ చేయుడు, నః=మమ్ములను, తత్=ప్రసిద్ధమయిన, మిత్రః=హింసనుండి రక్షించు సూర్యుడు, వరుణః=ఆవరణ శక్తికల వరుణుడు, అదితిః=అఖండశక్తిగల దేవమాత అదితియు, సిన్ధుః=ప్రవాహశీలములగు జలములకధిష్ఠాన దేవత, పృథివీ=భూమికధిష్ఠాన దేవతయగు ధరించు శక్తియు, ఉత=మరియు, ద్యౌః

=ద్యులోకాధిష్ఠాన దేవతయగు దీప్తి శక్తి, మామహన్తామ్=పూజించుదురు గాక!=ఆమోదింతురు గాక!=రక్షింతురు గాక!

**తాత్పర్యము:**-సూర్యోదయముతోడనే అటునిటు సంచరించు ఓ సూర్యరశ్మలారా! మీరు మమ్ము పాపములనుండి నింద్యకర్మములనుండి వారించి రక్షించుడు. మిత్ర-వరుణ-అదితి-సిన్ధు-పృథివీ-అన్తరిక్షరూపములయిన విభిన్నములగు షట్ శక్తులు మమ్ము రక్షించుగాక!

**విశేషములు:**- 1) పీటర్సన్ పండితుడు అంహస్ శబ్దమునకు భయమనియు, అవద్య శబ్దమునకు పాపకర్మజమగు లజ్జయనియు అర్థమును చెప్పియున్నాడు. 2) మిత్రుని యందగ్నిని, ఆకాశమున వాయువును, రశ్మలందు కర్తృత్వమును భావించినచో పరమేశ్వరుని అష్టమూర్తులను - పంచభూత, సూర్య, కర్తృత్వ శక్త్యాత్మకముల నిచట రక్షకములుగ కీర్తించుట జరిగినది. కాళిదాసుకూడా నిట్లే 'ప్రత్యక్షాభిః ప్రపన్న స్తనుభిరవతు వస్తాభిరష్టాభిరీశః' అని స్తుతించియున్నాడు.

**వ్యాకరణాంశములు:**-

**అంహసః** = అమ్+హుక్+అసున్-పంచమ్యేకవచనము,

**అద్యా** = అద్య శబ్దమునకు 'నిపాతస్య చ' (6.3.126) చే దీర్ఘము.

**అవద్యాత్** = వద్+యత్=వద్య - న+వద్య+అవద్య - పంచమ్యేకవచనము.

**పిపృతా** = పౄ పాలన పూరణయోః ధాతువునకు లోట్ మధ్యమ పురుషైక వచనరూపము. **'ఋచితను ధాతు'** (6.3.133) చే దీర్ఘము.

**సిన్ధుః** = స్యన్ద్+ఉ - యకారమునకు సంప్రసారణముచే నికారము, దకారమునకు ధకారాదేశము వచ్చినది.

**మామహన్తామ్** = మహ్ ధాతువు లోట్ ప్రథమ పురుష బహువచనము.

శ్రీః

శ్రీః

# సుధాలహరీ

## శ్రీ జగన్నాథ పణ్డితరాజ విరచితా
## పావనీ వ్యాఖ్య
## ఈమని వేంఙ్కట సత్యనారాయణమూర్తి

**అవతారిక:-** కవితల్లజుడగు జగన్నాథ పండితుడు నారాయణ స్వరూపుడగు సూర్యభగవానుని ఆశ్రిత రక్షణ తత్పరత నిచట ప్రస్తుతించుచున్నాడు.

**శ్లో॥ ఉల్లాసః ఫుల్లపఙ్కేరుహపటలపతన్మత్తపుష్పన్ధయానాం**
**నిస్తారశ్శోకదావానలవికలహృదాం కోకసీమన్తినీనామ్।**
**ఉత్పాతస్తామసానాముపహతమహసాం చక్షుషాం పక్షపాత**
**స్సఙ్ఘాతః కోఽపి ధామ్నామయముదయగిరిప్రాన్తతః ప్రాదురాసీత్॥ 1**

ప్రతిపద్ధాము:- ఫుల్ల.....న్ధయానామ్ - ఫుల్ల=వికసించిన, పఙ్కేరుహ=పద్మముల యొక్క, పటల=సమూహములందు, పతత్=వాలుచున్న, మత్త=మదించిన, పుష్పన్ధయానామ్=తుమ్మెదలకు, ఉల్లాసః=ఆనందసంధాయకమును, శోక.... హృదామ్ - శోక=(ప్రియుని వియోగమున జనించిన) దుఃఖమనెడు, దావానల= కార్చిచ్చుచే, వికల=కలగిన, హృదామ్=మనస్సులు కల, కోక సీమన్తినీనామ్= ఆడు జక్కవ పక్షులకు, నిస్తారః=(దుఃఖమును) పోగొట్టునదియును, తామసానామ్ 1.తామసగుణముకలవారికి, 2.చీకటివేళలసంచరించు ప్రాణి సమూహములకు, 3.చీకట్లసమూహములకు, ఉత్పాతః=కీడును కలుగ చేయునదియు, ఉపహత మహసామ్=వెలుగును కోల్పోయిన, చక్షుషామ్=కన్నులకు, పక్షపాతః= అనుగ్రహమును కలిగించునదియును, కః+అపి=అనిర్వచనీయమగు, అయమ్= ఈ, ధామ్నామ్=కాంతుల యొక్క, సంఘాతః=సమూహము (సూర్యభగవానుడు) ఉదయగిరిప్రాన్తతః=ఉదయపర్వత ప్రదేశమునుండి, ప్రాదురాసీత్=ప్రత్యక్ష మయ్యెను.

**తాత్పర్యము:-** వికసించిన పద్మవనములందు మకరందము నాస్వాదించుటకు వాలెడు తుమ్మెదలకు పరమానందమును కలిగించునదియు, ప్రియవియోగ

దుఃఖముచే చెదరిన మనస్సులు కల ఆడు చక్రవాకముల దుఃఖమును పోగొట్టు నదియు, చీకట్ల సమూహములకు, తామసస్వభావులకు, రాత్రిసంచరించు ప్రాణులకును కీడు కలిగించునదియును, తేజోవిహీనములగు నేత్రములకు సహకారము నందించునదియును, మిక్కిలి విలక్షణమగు సూర్యుని తేజస్స మూహము ఉదయగిరి ప్రాంతమున ప్రాదుర్భవించినది.

**విశేషములు:-** 1) కావ్యశాస్త్రాది రూపమగు గ్రంథ రచనమంతయు మంగళముతో ప్రారంభింపబడి, మంగళమధ్యముగ శోభిల్లి, మంగళాంతముగ ముగియుట సంప్రదాయము. అ ఇ ఉ అను వర్ణములు ఓంకార స్వరూపమున భాగములు. ఓంకారము శబ్దబ్రహ్మరూపము, పరమాత్మ వాచకము. ఉల్లాస శబ్దము ఆనందమును బోధించును. ఆనందము పరమాత్మ స్వరూపము. కనుక పరమ మంగళకరమగు 'ఉల్లాస' శబ్దముతో జగన్నాథ పండితుడు తన సుధాలహరిని ప్రారంభించియున్నాడు. 2) ఇచట సూర్య భగవానుడే వర్ణింప దలచిన ముఖ్య వస్తువు. అతని గుణ గణముల వర్ణన మిచట కలదు. కనుక నిచట వస్తు నిర్దేశ రూపమగు మంగళ మాచరింపబడినది. కల్యాణ గుణ వర్ణనముచే కవికి సూర్యునియందు కల పరమగౌరవము వ్యక్తమగుచుండుటచే, సూర్యనమస్కార రూపమగు మంగళ మిచట వ్యంగ్యముగ భాసించును. భగవల్లక్షణములగు శిష్ట రక్షణ, దుష్ట శిక్షణలిచట వర్ణింపబడినవి. కావున సూర్యభగవానుని ప్రాదుర్భావమే ప్రపంచమునకు పెద్ద ఆశీర్వచనము. కనుక ఆశీరాత్మకమగు మంగళాచరణమును గూడ నిచట భావింపవచ్చును. ఇట్లు జగన్నాథ పండితుడు తన సుధాలహరీ ప్రారంభమున 'ఆశీర్నమస్క్రియా వస్తు నిర్దేశో వాపి తన్ముఖమ్' అను సంప్రదాయమును పరిపూర్ణముగ పాటించినాడు. 3) ఇందు ల-త-క మొదలగు లలిత వర్ణములనేకమార్లు ఉచ్చరింపబడి చెవికింపును కూర్చుటచే నిచట యనుప్రాసమను శబ్దాలంకారము కలదు. 4) ఉల్లాసః-నిస్తారః-ఉత్పాతః -అనుచోట్ల కారణమందు కార్యత్వము-ఆరోపింప బడుటచే రూపకమను నర్థాలంకార మిచట కలదు. 5) తేజస్సమూహమున కవికి గల ప్రేమాతిశయము స్ఫురించుటచే 'రతిభావధ్వని' ఇచట ప్రధానము. శబ్దార్థాలంకారములంగము లగును.

**అవతారిక:-** గర్వమును పోగొట్టుట, లోకమును వెలిగించుట, దైన్యమును తొలగించుట, అను రవిగుణముల నిచట కవి వర్ణించుచున్నాడు.

**శ్లో॥** పద్మద్రోహోద్ధురాణాం ధవళితహరితామైన్దవీనాం ద్యుతీనాం
దర్పం ద్రాగ్ద్రావయన్తో విదలదరుణిమోద్రేకదేదీప్యమానాః।
దూరాదేవాన్ధకారాన్ధితధరణితలద్యోతనే బద్ధదీక్షా
స్తే దైన్యధ్వంసదక్షా ముదముదయదినోద్వేలదుస్రా దిశన్తు॥ 2

**ప్రతిపదార్థము:-** పద్మ.....ద్ధురాణామ్ - పద్మ=కమలములకు, ద్రోహ= అపకారమును కలిగించుటయందు, ఉద్ధురాణామ్=ప్రధానములును, ధవలిత హరితామ్=దిక్కులను తెల్లని కాంతులతో నింపునవియునగు, ఐందవీనామ్= చంద్రునికి సంబంధించిన, ద్యుతీనామ్=కాంతుల యొక్క, దర్పమ్=గర్వమును, ద్రాక్=శీఘ్రముగ, ద్రావయన్తః=పోగొట్టుచున్నవియు, విదల....దీప్యమానాః -విదలత్=వికసించుచున్న, అరుణిమా=ఎర్రదనము యొక్క, ఉద్రేక=విజృంభణచే, దేదీప్యమానాః=మిక్కిలిగ ప్రకాశించుచున్నవియు, అన్ధకారా.....ద్యోతనే - అన్ధకార=చీకట్లచే, అన్ధిత=గుడ్డిదిగా చేయబడిన, ధరణితల=భూతలమును, ద్యోతనే=వెలుగులతో నింపుటయందు, దూరాత్+ఏవ=బహుదూరము నుండియే, బద్ధదీక్షాః=పూనిక వహించినవియు, దైన్యధ్వంసదక్షాః - దైన్య=దీనత్వమును, ధ్వంస=నశింప చేయుటయందు, దక్షాః=సమర్థములగు, తే=ప్రసిద్ధములయిన, ఉదయ...దుస్రాః-ఉదయత్=ఉదయించుచున్న, ఇన=సూర్యునియొక్క, ఉద్వేలత్ =ఎగిసిపడు, ఉస్రాః=కిరణములు, ముదమ్=ఆనందమును, దిశన్తు= ఇచ్చుగాక!

**తాత్పర్యము:-** కమలములను ముకుళింప చేయుటచే సాపరాధములును, దిగంతములను తెల్లని వెలుగులచే ప్రకాశింపచేసినవియునగు చంద్రకిరణములు గర్వమునందినవి. సూర్యకిరణములాగర్వమును పరిహరించును. అప్పుడప్పుడే వికసించుచున్న అరుణకాంతి సమూహములచే రవికిరణములు మిక్కిలి శోభిల్లును. చీకట్లలో మునిగి కన్నులుండియు గ్రుడ్డితనము ననుభవించు ప్రాణులకు వెలుగులనందించుటలో రవికిరణములు దీక్షవహించును. సూర్యకిరణములు ప్రాణులదైన్యమును తొలగించుటలో మిగుల సమర్థములు. ఇట్టి ఉదయభానుని అరుణారుణ కిరణములు సహృదయులకానందమును ప్రసాదింపవలెనని కవి యాకాంక్షించుచున్నాడు.

**విశేషములు:**- 1) శిష్టరక్షణ, దుష్టశిక్షణ భగవల్లక్షణములు. కమలములు సూర్యుని ఆశ్రయించినవి. వానిని ముకుళింపచేయుట ద్వారా చంద్రకిరణములపకార మొనర్చినవి. వాటి గర్వము నణుచుట ద్వారా భానుకిరణములు దుష్ట శిక్షణము గావించినవి. ఇతరుల మీద ఆధారపడక తనకు తానుగా ప్రకాశించుట, సమస్తప్రాణులకు నుపకారమొనర్చుట రక్షణకార్యములు. కనుక సూర్యుడు కంటికి కనపడు భగవంతుడు - అను వ్యంగ్యమిచట ధ్వనించుచున్నది. 2) ద-ర-త మొదలగు వర్ణముల యావృత్తిచే నిచట శ్రవణ సుభగత్వము సాధింపబడినది కావున, అనుప్రాస మిచటి శబ్దాలంకారము.

**అవతారిక:**- రక్షణ ప్రకాశము వరప్రదానము పాపవిమోచనము మొదలగు శుభలక్షణములనిచట కవి సూర్యకిరణములందు దర్శించుచున్నాడు.

**శ్లో॥** త్రాతామీవార్తలక్షాః ప్రతిదినవిహితానేకగీర్వాణరక్షా
భక్తానాం కల్పవృక్షాస్స్ఫురదనలగతస్వర్ణభాసాం సదృక్షాః।
లోకక్షేమాత్తదీక్షా నలినపరిషదాం దత్తసౌభాగ్యలాక్షా
దుర్వృత్తధ్వంసదక్షా మమ రవికిరణాస్సన్త్వఘానాం విపక్షాః॥ 3

**ప్రతిపదార్థము:**- త్రాతా.... లక్షాః - త్రాత=రక్షింపబడిన, అమీవా=రోగములచే, ఆర్త=పీడింపబడినవారి యొక్క, లక్షాః=లక్షలు కలవియును, ప్రతిదిన....రక్షాః -ప్రతిదిన=ప్రతిరోజు, విహిత=చేయబడిన, అనేక=బహుసంఖ్యాకులగు, గీర్వాణ=దేవతలయొక్క, రక్షాః=రక్షణ కలవియును, భక్తానామ్=కొలుచువారికి, కల్పవృక్షాః =పారిజాతవృక్షములును (కోర్కెలు తీర్చునవియు), స్ఫుర.....భాసామ్ - స్ఫురత్=ప్రకాశించుచున్న, అనలగత=అగ్నియందున్న (కరగించబడిన), స్వర్ణ=బంగారము యొక్క భాసామ్=కాంతులకు, సదృక్షాః=సమానముగ ప్రకాశించునవియు, లోక..... దీక్షాః - లోక=భువనముల యొక్క, క్షేమ=కుశలమునకు, ఆత్తదీక్షాః =పూనికవహించినవియు, నలిన+పరిషదామ్=పద్మసమూహములకు, దత్తసౌభాగ్యలాక్షాః=సౌభాగ్యకరమగు సిందూరకాంతిని (లత్తుకను) ప్రసాదించినవియు, దుర్వృత్త....దక్షాః - దుర్వృత్త =1) దుర్మార్గులను, 2) దుశ్చర్యలను, ధ్వంస=నశింపచేయుటయందు, దక్షాః=సమర్థములునుఅగు, రవికిరణాః=సూర్యుని కాంతులు, మమ=నా యొక్క, అఘానామ్=పాపములకు, విపక్షాః =శత్రువులు (నాశకములు), సన్తు=అగుగాక!

**తాత్పర్యము:-** రవి కిరణములు - లక్షలాదిగ వ్యాధిపీడితులను రక్షించునవి. ప్రతిదినము రాక్షసానుకూలమగు రాత్రిని తొలగించుటచే దేవతలను రక్షించునవి. కల్పవృక్షమువలె భక్తుల కోరికలను తీర్చును. మేలిమి బంగరు కాంతులతో నేత్రానందమును కలిగించును. లోకమునకు శుభపరంపరను ప్రసాదించు దీక్షను వహించినవి. పద్మ సమూహములకు వికాసమును సౌభాగ్య సిందూరమును అను గ్రహించునవి. దుర్మార్గులను దుశ్చర్యలను సమర్థముగ నశింపచేయునవి. ఇట్టి మహిమ కల రవికిరణములు తన పాపముల పరిహరింపవలెనని కవి ప్రార్థించుచున్నాడు.

**విశేషములు:-** 1) 'ఆరోగ్యం భాస్కరాదిచ్ఛేత్' అనుటవలన ఆరోగ్యము కొరకు భాస్కరుని ప్రార్థింపవలెననునది సంప్రదాయము. మయూరుడను కవి 'సూర్య శతకము' ను రచించి సూర్యుని అనుగ్రహముతో కుష్ఠ రోగము నుండి విముక్తిని పొందినాడనునది సుప్రసిద్ధము. రోగార్తులు ఆరోగ్య సిద్ధికి స్వయముగ సూర్య నమస్కారములను చేయుట, కుదరనిచో ఎవరిచేతనైన చేయించి తత్ఫలమును పొందుట ద్వారా ఆరోగ్యమును పొందుట సంప్రదాయముగ నున్నది. కనుకనే జగన్నాథుడిచట 'త్రాతామీవార్తలక్షాః' అని మొట్టమొదట ప్రస్తావించినాడు. 2) రాత్రివేళల రాక్షసశక్తులు - దుశ్చర్యలు విజృంభించుటయు, పగటి వేళల దైవీశక్తులు - సత్కార్యములు పెంపొందుటయు లోక ప్రసిద్ధము. ఇదియే గీర్వాణరక్ష. 3) 'లోకాస్సమస్తా స్సుఖినో భవన్తు'. ఇది వైదికాశీర్వచనము. లోకము లన్నియు సుఖసంతోషములతో నుండవలయునని కోరుట సత్సంప్రదాయము. దీనిని పాటించువారందరూ లోకక్షేమదీక్షితులే. అట్టివారిలో సూర్య భగవానుడు అగ్రగణ్యుడు. 4) హిందూ సంప్రదాయంలో వివాహకాలాన భర్త భార్యకు పాపటప్రదేశాన సిందూరాన్ని అలంకరించటం అనూచానంగా వస్తున్నది. సూర్యుడు కమలనాథుడు. కనుకనే తన అరుణ కాంతులతో పద్మినులకు సౌభాగ్యసిందూరాన్ని ప్రసాదిస్తున్నాడు. ఈ అరుణకాంతియే పద్మినులకు పారాణిగాను ఉపయోగపడుతున్నది. 5) ఇచట ఇతర వర్ణావృత్తి యున్నను ప్రతిపదము యొక్క అన్తమున చేయబడిన 'క్ష' కారావృత్తి శ్రవణపేయముగ నున్నది. అనుప్రాసమలంకారము.

**అవతారిక:-** సూర్యభగవానుని సౌందర్య సామర్థ్యములిందు ప్రస్తుతింపబడినవి.

**శ్లో॥ ప్రాలేయానాం కరాలాః కవలితజగతీమణ్డలధ్వాన్తజాలా**
**స్త్రాతస్వర్లోకపాలా విదళదరుణిమక్షిప్తబాలప్రవాలాః।**
**విశ్లిష్యత్కోకబాలాజ్వరహరణభవత్కీర్తిజాలైర్జటాలా**
**వ్యోమవ్యాప్తౌ విశాలాస్త్వయి దధతు శివం భాస్వతో భానుమాలాః॥4**

**ప్రతిపదార్థము:-** ప్రాలేయానామ్=మంచుబిందువులకు, కరాలాః=భయమును కలిగించునవియు, కవలిత....జాలాః - కవలిత=మ్రింగబడిన, జగతీమణ్డల= ప్రపంచము యొక్క, ధ్వాన్తజాలాః=చీకట్ల సమూహములు కలవియు, త్రాత..... లోకపాలాః - త్రాత=రక్షింపబడిన, స్వర్లోకపాలాః=స్వర్గలోకమును పాలించు ఇంద్రాది దేవతలు కలవియు, విదల.... ప్రవాలాః - విదలత్=వికసించుచున్న, అరుణిమా=ఎర్రని కాంతులచే, క్షిప్త=తిరస్కరింప బడిన (జయించబడిన) బాల ప్రవాలాః=లేత చిగురాకులు కలవియు, విశ్లిష్యత్..... జాలైః - విశ్లిష్యత్= విరహిణులయిన, కోకబాలా=ఆడుచక్రవాక పక్షుల యొక్క, జ్వర=సంతాపమును, హరణ=తొలగించుటచే, భవత్=పుట్టుచున్న, కీర్తి= యశస్సుయొక్క, జాలైః =సమూహములచే, జటాలాః=పరివ్యాప్తములును, వ్యోమ వ్యాప్తౌ=ఆకాశము నందు విస్తరించుటలో, విశాలాః=విపులములును అయిన, భాస్వతః=సూర్యుని యొక్క, భానుమాలాః=కిరణపంక్తులు, త్వయి=నీయందు, శివమ్=శుభమును, దధతు=కలుగచేయుగాక!

**తాత్పర్యము:-** రవికిరణము లతిశీతలములగు మంచు బిందువులను కరగించి శీత బాధను తొలగించును. ప్రపంచమందంతట వ్యాపించి, చీకట్లను పార ద్రోలును. స్వర్గలోక పాలకులను కూడ తమ కాంతి ప్రసారములచే రక్షించును. అరుణకాంతుల విజృంభణముచే లేజిగురాకులను సౌందర్యమున జయించును. ఆడు చక్రవాక పక్షుల యొక్క వియోగ బాధను తొలగించి గొప్ప కీర్తిని సాధించును. గగనతలమందంతట వ్యాపించుటలో నేర్పరులు. ఇట్టి భాను కిరణములు మీకు శుభమును కలిగింపవలెనని కవి ప్రార్థించుచున్నాడు.

**విశేషములు:-** 1) 'లాః' అను వర్ణము 7 సార్లు ఆవృత్తమయి చెవికింపును గూర్చుటచేనిచట అనుప్రాసము శబ్దాలంకారము. ఇది రవి విషయమున కవికి

గల (రతి) భక్తి భావమున కంగభూతము. 2) మంచుబిందువులు చీకట్లు చిగురాకులు–శత్రు పక్షమునకు సంబంధించినవి. వీటి గర్వమును పరిహరించుట జరిగినది. ఇది దుష్ట శిక్షణ. ఇంద్రాదులను రక్షించుట, విరహజ్వరమును పోగొట్టుట అనునవి శిష్టరక్షణ కార్యములు. కనుక సూర్యుడు ప్రత్యక్ష దైవమయినాడు.

**అవతారిక:**– ఉదయభానుని సువర్ణ కిరణముల విలాసములిందు మనోహరముగ వర్ణింపబడినవి.

**శ్లో॥ నిర్భిద్య క్ష్మారుహాణామతిఘనముదరం యేషు గోత్రాం గతేషు**
**ద్రాఘిష్ఠస్వర్ణదణ్డభ్రమభృతమనసస్సన్నిధిత్సన్తి పాదాన్।**
**యై స్సమ్భిన్నే దలాగ్రప్రచలహిమకణే దాడిమీబీజబుద్ధ్యా**
**చఞ్చూచాఞ్చల్యమఞ్చన్తి చ శుకశిశవస్తేஉంశవః పాన్తు భానోః॥ 5**

**ప్రతిపదార్థము:**– యేషు=ఏ రవి కిరణములు, క్ష్మారుహాణామ్=చెట్ల యొక్క, అతిఘనమ్=మిక్కిలి చిక్కని, ఉదరమ్=మధ్యభాగమును, నిర్భిద్య=చీల్చుకొని, గోత్రామ్=భూమిని, గతేషు=పొందినవగుచుండగా, శుకశిశవః=చిన్ని చిలుకలు, ద్రాఘిష్ఠ..... మనసః – ద్రాఘిష్ఠ=మిక్కిలి పొడవయిన, స్వర్ణదణ్డ=బంగారు కడ్డీలుగ, భ్రమభృతతమనసః=భ్రాంతిని పొందినవై, పాదాన్=తమ కాళ్ళను, సన్నిధత్సన్తి=నిలుపకోరుచున్నవో, చ=మరియు, యైః=ఏ కిరణములతో, సమ్భిన్నే =కలగలసిన, దలాగ్రప్రచల హిమకణే–దల=ఆకులయొక్క, అగ్ర=పైభాగమున, ప్రచల=కదలుచున్న, హిమకణే=మంచుబిందువునందు, దాడిమీ బీజ బుద్ధ్యా= దానిమ్మ గింజలను భావముచే, చఞ్చూ చాఞ్చల్యమ్=(తమ) ముక్కుల చపలత్వమును, అఞ్చన్తి=ప్రదర్శించుచున్నవో, తే=అటువంటి, భానోః=సూర్యుని యొక్క, అంశవః= (ఉదయ) కిరణములు, పాన్తు=రక్షించుగాక!

**తాత్పర్యము:**– సూర్యుని ఉదయ కిరణములు – మిక్కిలి దట్టముగ ఆకులతో నిండియున్న చెట్ల మధ్యనుండి, సన్నని రంధ్రముల ద్వారా భూమిని చేరుచున్నవి. అవి బంగారు వన్నె కలవి కావున 'ఇవి బంగారు కడ్డీలు, వీటి మీద మన పాదము లుంచవచ్చును' అని, అమాయకములయిన చిన్ని చిలుకలు భావించు

చున్నవి. అట్లే స్వర్ణ కిరణములతో సంపర్కమునొంది, చిగురాకులపై కదలాడు చున్న మంచుబిందువులను చూచి, ఆ చిలుక పిల్లలు - దానిమ్మ గింజలను భావముచే తమ ముక్కులతో తినుటకు ప్రయత్నించుచున్నవి. ఇట్టి ఉదయభానుని బంగారు కాంతులు మిమ్ము రక్షించుగాక! అని కవి సంభావించుచున్నాడు.

**విశేషములు:-** అన్ని పద్యములలో వలె అనుప్రాసాలంకారమిచటను కలదు. సూర్యుని స్వర్ణ కిరణ విలాసములిందు సుందరముగ వర్ణింపబడుటచే 'స్వభావోక్తి' యను అర్థాలంకార మిచట నున్నది. అట్లే చిలుక బాలల భ్రాంతి నిచట వర్ణించుటచే భ్రాంతిమదలంకారమును కాననగును. ఇచటి యలంకారము లన్నియు ప్రధానమగు భక్తి భావ ధ్వనికి పోషకములగుచున్నవి.

**అవతారిక:-** కమలముల కనురక్తిని, కలువలకు విరక్తిని, ముంగిళ్ళకు సంపత్తిని కలిగించు అరుణ కిరణములిచట ప్రస్తుతింపబడినవి.

**శ్లో॥ అహ్ని క్రీడోచితానాం సరసిరుహలసన్మన్దిరాణాం ప్రభాతే**
**ప్రోద్ఘాట్య ద్రాక్కపాటాన్యథ కుముదగృహాన్ముద్రయన్తో విముక్తాన్।**
**సిఞ్చన్తః కిఞ్చ భూమీతలమఖిలమపి క్షుణ్ణకాశ్మీరనీరైః**
**పాయాసుశ్శ్రీసపర్యావిరచనపటవః పద్మబన్ధోః కరా నః॥ 6**

**ప్రతిపదార్థము:-** ప్రభాతే=ప్రాతఃకాలమున, అహ్ని=పగటి వేళల, క్రీడోచితానామ్ =వినోదమున కర్హములయిన, సరసిరుహలసన్మన్దిరాణామ్ - సరసిరుహ=పద్మము లనెడు, లసత్=ప్రకాశించుచున్న, మన్దిరాణామ్=దేవతావాసములయొక్క, కపాటాని=తలుపులను, ద్రాక్=శీఘ్రముగ, ఉద్ఘాట్య=తెరచి, అథ=తరువాత, విముక్తాన్=వికసించిన (తెరచిన), కుముదగృహాన్=కలువల ఇళ్ళను, ముద్రయన్తః =మూసివేయుచున్నవియు (ముకుళింపచేయునవియు), కిఞ్చ=మరియు, భూమీ తలమ్=భూమి యొక్క ఉపరిభాగమును, అఖిలమ్ + అపి=సమస్తమును, క్షుణ్ణ కాశ్మీర నీరైః - క్షుణ్ణ=పొడిచేయబడిన, కాశ్మీర=కుంకుమపువ్వుయొక్క, నీరైః= జలములతో, సిఞ్చన్తః=తడుపుచున్నవై, (కనుకనే) శ్రీ సపర్యా..... పటవః - శ్రీసపర్యా=అందమైన సేవలను, విరచన=చేయుటలో, పటవః=సమర్థములయిన, పద్మబన్ధోః=కమలాప్తుడగు సూర్యుని యొక్క, కరాః=కిరణములు, నః=మమ్ములను, పాయాసుః=రక్షించుగాక!

**తాత్పర్యము:-** పగటివేళ కమలములు వికసించును. కలువలు మాత్రము ముకుళించును. ఇది కాల ధర్మము. రవి కిరణములు కాల నియామకములు. కనకనే పగళ్ళ శోభించదగిన పద్మ మందిరముల తలుపులను రవికిరణములు వికసింపచేయుచున్నవి. ఇదివరకే తెరువబడియున్న కలువల ఇంటి తలుపులను మూయించుచున్నవి. ప్రాతఃకాలమున గృహిణులు వాకిళ్ళను శుభ్రపరచి, నీళ్ళు జల్లి అలంకరించుట ప్రసిద్ధము. అట్లే రవి కిరణములును భగవంతుని ఇల్లగు సమస్త భూమండలమును ప్రశస్తములగు కుంకుమపువ్వుల పరాగములతో కూడిన నీటితో అలంకరించుచున్నవి. అట్టి రవి కిరణములు తమ్ము రక్షింపవలెనని కవి యాకాంక్షిచుచున్నాడు.

**విశేషములు:-** 1) విరాడ్రూపుడగు పరమాత్ముని 8 రూపములలో రవి-చంద్ర రూపములు కాలనియామకములు. ఆయా సమయములందాయా పనులను చేయించుట భగవత్కార్యము. కనుకనే సూర్యభగవానుడు కమలములకు వికాసమును, కలువలకు సంకోచమును కలిగించుచున్నాడు. లక్ష్మీనివాసములగు కమలములకు వికాసము కలిగించుటచే లక్ష్మీదేవికి సపర్యలు చేయుచున్నాడు. 'మన్దిర' 'శ్రీ' శబ్దము లిచట వ్యంజకములు. పరమాత్ముని 8 రూపములు పరస్పర పోషకములు మరియు అన్యోన్య పూరకములు. కనుక రవి భూమిని కాశ్మీరనీరముతో అలంకరించుచున్నాడు. 2) 'సరసిరుహ లసన్మన్దిరాణామ్' అనుటవలన, పద్మములే ప్రకాశించు గృహములని అభేదమును చెప్పుటచే నిచట రూపకమలంకారము. 'కుముద గృహాణి' అనుటయు రూపకమే. 3) అరుణ కిరణముల నిచట క్షుణ్ణ కాశ్మీరనీరములుగ సంభావించుటచే (కిరణవ్యాప్తిని - నీర సేచనముగ) నిచట వస్తూత్ప్రేక్ష మరియొక అలంకారము. 4) న-త- మొదలగు వర్ణములయావృత్తియుండుటచే అనుప్రాసము కలదు. 5) ప్రధానమగు (రతి) భక్తి భావ ధ్వనికి పై అలంకారములు పరిపోషకములు.

**అవతారిక:-** మేడలపై చిగురుటాకులపై మంచుగడ్డలపై రవి కిరణములు చేయు విలాసములిందు వర్ణింపబడినవి.

**శ్లో॥** ఆలేపా హిఙ్గులీనామివ ధరణిభుజామచ్ఛసౌధాగ్రమౌళి
ష్వగ్రేషు క్ష్మారుహాణామభినవవిదలత్పల్లవోల్లాసలీలాః

ప్రౌఢప్రాలేయపుఞ్జోపరి చితఖదిరాఙ్గారభారా ఇవారా
త్పారావారాత్ప్రయాన్తో దినకరకిరణా మఙ్గలం నః కృషీరన్॥ 7

ప్రతిపదార్థము:- ధరణిభుజామ్=మహారాజుల యొక్క, అచ్ఛసౌధాగ్రమౌలిషు - అచ్ఛ=స్వచ్ఛములయిన, సౌధ=ప్రాసాదములయొక్క, అగ్ర=పై భాగముననున్న, మౌలిషు=శిఖరములందు, హిఙ్గులీనామ్=ఎరుపురంగులయొక్క, ఆలేపాః + ఇవ=పూతలోయనునట్లును, క్ష్మారుహాణామ్=వృక్షములయొక్క, అగ్రేషు=కొన భాగములందు, అభినవ....లీలాః - అభినవ=క్రొత్తగా, విదలత్=వికసించుచున్న, పల్లవ=చిగురుటాకులయొక్క, ఉల్లాస=ఆనందమునకలుగు, లీలాః+ఇవ= విలాసములోయనునట్లును, ప్రౌఢ..... పరి - ప్రౌఢ=పెద్దవగు, ప్రాలేయ=మంచు బిందువుల యొక్క, పుఞ్జ=సమూహముల యొక్క, ఉపరి=పై భాగమున, చిత..... భారాః - చిత=పేర్చబడిన, ఖదిర=చంద్రకర్రకు సంబంధించిన, అఙ్గార=నిప్పు కణికల యొక్క, భారాః=బరువులు, ఇవ=అనునట్లు, ఆరాత్=సుదూరముననున్న, పారావారాత్=జలనిధినుండి, ప్రయాన్తః=ప్రయాణించి వచ్చుచున్న, దినకర కిరణాః=సూర్యకిరణములు, నః=మాకు, మఙ్గలమ్=శుభమును, కృషీరన్= కలిగించుగాక!

**తాత్పర్యము:-** రవి యొక్క అరుణ కిరణములు - తెల్లని రాజ ప్రాసాదముల శిఖర భాగములకు ఎరుపు రంగును పులుముచున్నట్లున్నవి. వృక్షాగ్రములందు అప్పుడే ఉదయించుచున్న చిగురాకులహొయలను కూర్చుచున్నవి. మంచు బిందువుల సమూహములపై చంద్రనిప్పుల వర్షములాయనునట్లున్నవి. అట్టి దినకరుని అరుణ కిరణములు తమకు శుభపరంపర ననుగ్రహించవలెనని కవి ప్రార్థించుచున్నాడు.

**విశేషములు:-** 1) సూర్యుడు స్థిరముగ నుండును. సూర్యుని చుట్టూ భూమియే పరిభ్రమించుచున్నది. ఇది శాస్త్రీయ సత్యము. భూమి మీద నిలబడి చూచు వారికి మాత్రము సూర్యబింబమే సాగరమునుండి బయల్వెడలి భూమి చుట్టూ పరిభ్రమించుచున్నదను భావము స్ఫురించును. కనుకనే కవి పలుచోట్ల రవి బింబము సాగర గర్భమునుండి ప్రాదుర్భవించు చున్నట్లు వర్ణన చేయుచున్నాడు. 2) అరుణ కిరణవ్యాప్తిని, ఎరుపురంగుపూయుటగను, పల్లవముల విలాసలీల

గను, చంద్రనిప్పులు కురియుటగను, కవి సంభావించుటచే నిచట వస్తూత్ప్రేక్ష యలంకారము, ఉత్ప్రేక్షానుప్రాసములు భక్తిభావ ధ్వనికంగములగును.

**అవతారిక:** – సూర్యోదయమును–తూర్పు దిక్కు పుత్రరత్నమును ప్రసవించుటగా, కవి ఇచట సంభావించుచున్నాడు.

**శ్లో॥ కీలాలైః కుఙ్కుమానాం నిఖిలమపి జగజ్జాలమేతన్నిషిక్తం**
**ముక్తాశ్చోన్మత్తభృఙ్గా విదలితకమలక్రోడకారాగృహేభ్యః।**
**ఉత్సృష్టం గోసహస్రం బహలకలకల శ్రూయతే చ ద్విజానాం**
**భాగ్యైర్వృన్దారకాణాం హరిహయహరితా సూయతే పుత్రరత్నమ్॥ 8**

**ప్రతిపదార్థము:** – ఏతత్=ఈ, జగత్+జాలమ్=ప్రపంచ సమూహము, నిఖిలమ్ + అపి=సమస్తమును, కుఙ్కుమానామ్=కుంకుమ పూలయొక్క, కీలాలైః= జలములచే, నిషిక్తమ్=తడుపబడినది, గో సహస్రం=1) వేల కొలది ఆవులు, 2) వేల కొలది కిరణములు, ఉత్సృష్టమ్=విడువబడినవి, విదలిత....గృహేభ్యః – విదలిత=వికసించిన, కమల=పద్మముల యొక్క, క్రోడ=ఒడులను, కారా గృహేభ్యః=జైళ్ళ నుండి, ఉన్మత్తభృఙ్గాః=మదించిన తుమ్మెదలు, ముక్తాః=విడువ బడినవి, ద్విజానామ్=1) బ్రాహ్మణులయొక్క, 2) పక్షుల యొక్క, బహల కలకలః =1) విస్తారమగు వేదాది పాఠములవల్లనగు ధ్వని విశేషము, 2) కిలకిలారావము, శ్రూయతే=వినబడుచున్నది, వృన్దారకాణామ్=దేవతల యొక్క, భాగ్యైః= పుణ్యములచేత, హరిహయ హరితా=ఇంద్రునిదగు తూరుపు దిక్కుచే, పుత్రరత్నమ్ =గొప్ప కుమారుడు, సూయతే=ప్రసవింపబడుచున్నాడు.

**తాత్పర్యము:** – ప్రభాత కాలమున అరుణ కాంతులు జగమంతయు పరచుకొన్నవి. కుంకుమపూపరాగములతో కూడిన జల ప్రవాహములచే ప్రపంచమంతయు తడుపబడినట్లు కానవచ్చుచున్నది. అప్పుడే పద్మములు మేలుకొనుచున్నవి. వాని ఉదరభాగమున బంధింపబడిన మదించిన తుమ్మెదలు బయటకు వచ్చి, స్వేచ్ఛా గానము చేయుచున్నవి. ఆవులు కిరణములు తమ తమ నెలవుల నుండి బయల్వెడలినవి. ప్రాత స్సంధ్యలో విప్రవరులు పఠించు మంత్రముల కలకల ధ్వనులు – పక్షుల కిలకిలారావములు వినవచ్చుచున్నవి. దేవతల యదృష్ట విశేషముచే తూరుపుదిక్కు సూర్యుడను పుత్రుని ప్రసవించుచున్నది.

**విశేషములు:**– 1) అరుణ కాంతులు పరచుకొనుటను–కుంకుమ ప్రవాహములచే తడుపుటగాను, సూర్యోదయమును తూర్పుదిక్కు పుత్రరత్నమును ప్రసవించుట గాను, సంభావించుటచే నిచట యుత్ప్రేక్షాలంకారము. ఇది ప్రధానమగు భక్తి భావమునకు పోషకమగుచున్నది. 2) గొప్పవారి పుట్టుక ప్రపంచమునకు శుభ పరంపర ననుగ్రహించును. తూరుపుతల్లి గొప్ప బిడ్డను కనుచున్నది. ఇది యొక ఉత్సవ సమయము. కనుకనే ప్రపంచమంతయు కుంకుమ రసముచే తడిపి యలంకరింపబడినది. ఉత్సవ సమయములందు ఆనంద సూచకముగ ఖైదీలను విడిచిపెట్టుట సంప్రదాయము. ఇచట బద్ధములగు తుమ్మెదలు విముక్తినొందినవి. పావురములు గోవులు శాంతిని ఆనందమును సూచించును. ఇచట గోవులు తమ కట్టు కొయ్యల నుండి విడువడినవి. ఉత్సవములు మంగళ ధ్వనులతో ప్రారంభింపబడును. వేదమంత్రములు పక్షుల కిలకిలరావములు మంగళ తమములు. 3) రాక్షసులకు రాత్రివేళలందు బలము హెచ్చును. దేవతలకు బలము తద్విపరీతముగ నుండును. కనుక సూర్యోదయము దేవతలకు పరమానందకరము. ఆనంద మేర్పడుటకు పుణ్యమే కదా! కారణము. ఇట్లు సూర్యోదయమును, జగత్తున కుత్సవముగను, తూరుపు పుత్రుని ప్రసవించుటగను వర్ణించి కవి తన ప్రతిభకు పట్టము కట్టినాడు. 4) తూరుపు దిక్కునకు 'ఇంద్రీ' అని పేరు. ఇంద్రుడు తూర్పునకు పాలకుడు. తూరుపు దిక్కను కాంతను ఇంద్రుని పడతిగా సంభావించినచో, ఆమె ప్రసవము దేవతలకు వారసుని ప్రసాదించునది కావున, వారికి పరమానందహేతువు. ప్రత్యక్షదైవమగు సూర్యుడు – ఇంద్రునికి వారసుడని ఇచట వ్యంగ్యముగ సూచింపబడినది.

**అవతారిక:**– ప్రాణికోటికి చైతన్య విలాసములను కలిగించు భానుప్రభ కన్నులకు దూరము కారాదని కవి కాంక్షించుచున్నాడు.

శ్లో॥ యా సూతే సర్వభూతేష్వనుదినముదయే చేతనాయా విలాసా
న్యాస్తే సాయం నికాయం జలనిధిజఠరం సఙ్జారీహర్తి సద్యః।
అత్యర్థం వర్ధయన్తీ మణిగణసుషమాసమ్పదం రత్నసానో
స్సా నో భానోః ప్రభా నో నయనసరణితో దూరతో జాతు యాతు॥ 9

**ప్రతిపదార్థము:**– యా=ఏ సూర్యకాంతి, అనుదినమ్=ప్రతిరోజు, ఉదయే=ప్రభాత

కాలమున, సర్వభూతేషు=అన్ని ప్రాణులయందు, చేతనాయాః=చైతన్యము యొక్క, విలాసాన్=వైభవములను, సూతే=ప్రసవించుచున్నదో, యా=ఏ సూర్యకాంతి, సాయమ్=సాయంకాలమున, నికాయమ్=(తన) నివాసస్థానమును, యాన్తీ= పొందుచున్నదై, సద్యః=వెంటనే, జలనిధి జఠరమ్=సముద్ర గర్భమున, సంజరీ హర్తి=అదృశ్యమగుచున్నదో, యా=ఏ సూర్యకాంతి, రత్నసానోః= మణులతో నిండిన మేరు పర్వతము యొక్క, మణి..... సంపదమ్ - మణి= రత్నముల యొక్క, గణ=సమూహములకు సంబంధించిన, సుషమా=పరమ శోభ యొక్క, సంపదమ్=సంపత్తిని, అత్యర్థమ్=మిక్కిలిగా, వర్ధయన్తీ= పెంపొందించుచున్నదో, సా=అట్టి, భానోః=సూర్యుని యొక్క, ప్రభా=కాంతి, నయన సరణితః=నేత్ర మార్గమునుండి, దూరతః=దూరముగ, జాతు=ఒకప్పుడును, నో యాతు=తొలగి పోకుండుగాక!

**తాత్పర్యము:-** రవిప్రభ జీవకోటికి చైతన్య విలాసములను దినదినము కలుగ చేయును. సాయం సమయమున సాగర గర్భమున మలగి పోవును. మణిమయ మగు మేరుపర్వతపు మేలిమి కాంతులను వేవిధముల పెంపొందింపచేయును. ఇట్టి రవి ప్రభ, అన్ని వేళల కన్నులకు సన్నిహితముకావలెనని కవి ప్రార్థించు చున్నాడు.

**విశేషములు:-** 1) ప్రాణికోటి యంతయు చైతన్యవంతమే. అయిననూ ఆ చైతన్యము రాత్రివేళల అత్యల్పముగనో అభావముగనో మిగిలిపోవుచున్నది. సూర్యోదయము-సమస్త చైతన్య విలాసములు పునరుజ్జీవనమునొంది వివిధ క్రియారూపములను సంతరించుకొనుటకు కారణమగుచున్నది. కనుక సూర్య కాంతికి చైతన్య విలాసములకు అవినాభావ సంబంధమున్నది. కావున సూర్య కాంతి చేతనకు చేతనయనవచ్చును. సూర్యకాంతి మహిమకీ వర్ణనము మణి దర్పణము. 2) మణి గణములెంత స్వయంప్రకాశములయిననూ, సూర్యకాంతి ప్రతిఫలనము చేతనే వాని కాంతి విశేషములు ధగద్ధగితములగు చున్నవి. దేవతానిలయమగు మేరు పర్వతము, అందలి మణిమయకాంతులు రవి కిరణ సన్నిధానమున పొందు హొయలను కవి మన మనోనేత్రములకు సాక్షాత్కరింప చేసినాడు. 3) స్వభావోక్తి - అనుప్రాస - ఇచట భక్తి భావాంగములయినవి.

**అవతారిక:-** పరమకారుణికుడగు లోక బాంధవుని తీక్ష్ణ కాంతి దుఃఖహేతువులగు ఆశాపాశముల తొలగింపవలెనని కవి ప్రార్థించుచున్నాడు.

**శ్లో॥** నీహారైర్నీరజానాం నిబిడతమతమోరాశిభిర్లోచనానాం
శ్రౌతస్మార్తక్రియాణామపి ఖలు నిశయా నాశమాలక్ష్య దూరాత్।
సద్యస్సిన్ధోస్సకాశాదధికతరజవేనాగతా వాసవాశా
మాశాపాశానశేషానపహరతుతరాం తీక్ష్ణభానోః ప్రభా నః॥ **10**

**ప్రతిపదార్థము:-** నీరజానామ్=పద్మములకు, నీహారైః=మంచుచేతను, లోచనానామ్=కన్నులకు, నిబిడతమ.... రాశిభిః - నిబిడతమ=మిక్కిలి చిక్కని, తమః=చీకట్ల యొక్క, రాశిభిః=సమూహములచేతను, శ్రౌతస్మార్త క్రియాణామ్= వైదిక - ధార్మిక క్రియలకు, అపి=కూడా, నిశయా=రాత్రిచేతను, నాశమ్= లోపమును, ఆలక్ష్య=గుర్తించియే, ఖలు=కదా!, సద్యః=వెనువెంటనే, సిన్ధోః= సముద్రము యొక్క, సకాశాత్=సమీపము నుండి, అధికతర జవేన=మిక్కిలి వేగముతో, వాసవాశామ్=ఇంద్రునిదగు తూరుపు దిక్కును, ఆగతా=పొందినదగు, తీక్ష్ణభానోః=ప్రచండ కిరణుడగు సూర్యుని యొక్క, ప్రభా=కాంతి, నః=మా యొక్క, అశేషాన్=సమస్తములగు, ఆశాపాశాన్=కోరికలనెడు బంధములను (తాళ్ళను) అపహరతు తరామ్=తొలగించుగాక!

**తాత్పర్యము:-** రవి ప్రభకు పరోపకారమే స్వభావము. మంచు బిందువులచే కమలములకు, చిమ్మ చీకట్లచే కన్నులకు, రాత్రిచే శ్రౌతస్మార్త క్రియాకలాపములకు హాని కలుగునని ముందే ఊహించి, మిక్కిలి వేగముతో సముద్రమునుండి బయట పడి తూర్పుదిక్కున సూర్యభగవానుదుదయించినాడు. ఇట్టి చండకిరణుడగు భానుని ప్రభ మాయాశాపాశములను తొలగించుట ద్వారా సుఖశాంతులను కలుగ చేయ వలెనని కవి యాశించుచున్నాడు.

**విశేషములు:-** 1) నీహారము, అంధకారము ఆశాపాశములు దుఃఖమును కలిగించునవి. కనుక వీటి నాశము కాంక్షించదగినది. పద్మములు నేత్రములు శ్రౌతస్మార్త క్రియలు ఆప్త వర్గములోనివి. వీనిని సముద్ధరింపవలెను. సూర్యుడు చండ భానుడు. కావున పై రెండు పనులను సాధింప సమర్థుడని కవి భావన. 2) బుద్ధభగవానుడు లోకమునందలి సమస్త ప్రాణుల దుఃఖములకు కోరికలే

హేతువులని నిశ్చయించినాడు. ఇట్టి నిశ్చయము తపోమూలకమయిన జ్ఞానోప లబ్ధిచే సాధింపబడినది. కావున నీ జ్ఞానము నిర్దుష్టము. ఇట్టి జ్ఞానమును పొందుట చేతనే సిద్ధార్థుడు 'బుద్ధుడుగా' (జ్ఞానమును పొందినవాడని యర్థము) కీర్తింప బడినాడు. పై బోధను మనస్సునందుంచుకొని యాశాపాశముల నున్మూలింప వలసినదిగా నిగ్రహానుగ్రహ సమర్థుడగు సూర్యభగవానుని కవి ప్రార్థించు చున్నాడు. 3) ప్రభా అను విశేష్యమునకు 'చండభానోః' అనునది విశేషణముగ అన్వయించును. ఆశాపాశముల తొలగించుట – అను కార్యమును సాధించుటకు సామాన్య ప్రభ కాక చండభానుని ప్రభ మిక్కిలి ఉపయుక్తము. కనుక విశేషణము సాభిప్రాయమయినది. కావుననిచట పరికరాలంకారము.

**అవతారిక:**– సూర్యభగవానుని పరమకారుణికత్వ మిచట వర్ణింపబడినది.

**శ్లో॥ శీతే శోకం శశాఙ్కే కృశతమరుచితామాశు నాశం నిశాయాం**
**ధిక్కారం ధ్వాన్తవర్గే కుముదపరిషది ప్రోద్గమం దీనతాయాః।**
**పాణ్డిత్యం పుణ్డరీకేష్వనుదినమధికాం కాన్తిమాశాసు తన్వ**
**న్నన్వఞ్ఛత్యన్వహం ద్యాముషసి కరుణయా విశ్వవన్ద్యో వివస్వాన్॥ 11**

**ప్రతిపదార్థము:**– శీతే=చలియందు, శోకమ్=దుఃఖమును, శశాఙ్కే=చంద్రుని యందు, కృశతమ రుచితామ్=కాంతిహీనతను, నిశాయామ్=రాత్రియందు, ఆశు=శీఘ్రముగ, నాశమ్=వినాశమును, ధ్వాన్తవర్గే=చీకట్ల సమూహమునందు, ధిక్కారం=పరాజయమును, కుముదపరిషది=కలువల కొలువున, దీనతాయాః =దైన్యము యొక్క, ప్రోద్గమమ్=ఆవిర్భావమును, పుణ్డరీకేషు=పద్మములయందు, పాణ్డిత్యమ్=వికాసమును, ఆశాసు=దిక్కులయందు, అధికామ్=గొప్పదగు, కాన్తిమ్ =వెలుగును, అనుదినమ్=ప్రతిరోజు, తన్వన్=విస్తరింపచేయుచు, విశ్వవన్ద్యః= సర్వలోక పూజ్యుడగు, వివస్వాన్=భానుమూర్తి, కరుణయా=దయతో, అన్వహమ్= ప్రతిదినము, ఉషసి=ప్రాతఃకాలమున, ద్యామ్=ఆకాశమునందు, అన్వఞ్ఛతి= ఉదయించుచున్నాడు.

**తాత్పర్యము:**– సూర్యభగవానుడు దయామయుడు. కనుకనే ప్రతిరోజు ప్రాతః కాలమున ఆకాశమందు ప్రత్యక్షమగుచున్నాడు. వస్తూనే సూర్యుడు చలిని నాశనం

చేస్తాడు. చంద్రుని కాంతులను మందగింప చేస్తాడు. రాత్రికి చరమగీతం పాడుతాడు. చీకట్లను జయిస్తాడు. కలువలకు గర్వాన్ని పోగొట్టి దైన్యం కలుగ చేస్తాడు. పద్మాలకు వికాసం కలిగిస్తాడు. దిక్కులన్నింటిని మిక్కిలిగా ప్రకాశింప చేస్తాడు. సమయోచితములయిన ఇన్ని కార్యాలను చక్కదిద్దే సూర్యభగవానుని కరుణ అపారమైనది. కనుకనే అతడు విశ్వవంద్యుడయినాడు.

**వి॥ :-**1) చేసిన పనులనే చెయ్యటం అంత ప్రీతికరం కాదు. అయినా సూర్య భగవానుడు విసుగులేకుండా హితభావనతో ఇన్ని పనులను సమయోచితంగా చేస్తూనే ఉన్నాడు. విసుగు విరామం లేకుండా పనులను చేస్తూ పోవటం, చేయిస్తూ ఉండటం నాయక లక్షణము. అందుకే సూర్యుడు జగన్నాయకుడు విశ్వవంద్యుడు అయ్యాడు. నాయకుడు ఎలా ఉండాలి. అనే ప్రశ్నకు సమాధానం సూర్య భగవానుడే. మిత్ర రక్షణ శత్రునాశం కరుణ కార్యదీక్ష అన్నీ యీ పద్యంలో వర్ణింపబడి విశ్వవంద్యుడు కావాలంటే ఏమేం చేయ్యాలో మార్గనిర్దేశం చేయ బడింది. ఇది గొప్ప కావ్యోపదేశము.

**అవతారిక:-** విశ్వమందలి ప్రాణుల దుఃఖ నివారణమే పరమ ధర్మముగా కల గగనమణియగు సూర్యభగవానుడు సుఖశాంతులను కలిగింపవలెనని కవి యాకాంక్షించుచున్నాడు.

**శ్లో॥** స్వాపం స్వాపాకులానాం గదమథ గదినామన్ధకారం త్రిలోక్యాః
పాపం పాపావిలానాం సపది పరిహరన్నాగతో వాసవాశామ్।
నిత్యప్రస్థానలీలాకుపితకమలినీనర్మనిర్మాణకర్మా
విశ్వార్తిత్రాణధర్మా గగనమణిరసౌ పాతు శర్మానిశం వః॥ 12

**ప్రతిపదార్థము:-** స్వాప+ఆకులానామ్=(కలత)(కలల) నిద్రచే భాధితులగు వారి యొక్క, స్వాపమ్=నిద్రను, అథ=మరియు, గదినామ్=రోగార్తులయొక్క గదం=రోగమును, త్రిలోక్యాః=ముల్లోకములయొక్క, అన్ధకారమ్=చీకటిని, పాప+ +ఆవిలానామ్=దుష్కర్మలచే కలుషితులయినవారి యొక్క, పాపమ్=దుష్కర్మజ మగు పాపమును, సపది=శీఘ్రముగ, పరిహరన్=తొలగించుచూ, వాసవాశామ్ =ఇంద్రునిదగు తూర్పు దిక్కును, ఆగతః=పొందినవాడైన, నిత్య ..... కర్మా -

నిత్య=ఎల్లప్పుడు, ప్రస్థాన=ప్రయాణమను, లీలా=విలాసముచే, కుపిత=కోపించిన కమలినీ=పద్మలతయొక్క, నర్మ=సంతోషమును, నిర్మాణ=సృష్టించుటయను, కర్మా =పనిచేయువాడును, విశ్వార్తిత్రాణధర్మా - విశ్వ=ప్రపంచము యొక్క ఆర్తి=పీడ నుండి, త్రాణ=రక్షించుటయను, ధర్మా=ధర్మముకల, అసౌ=ఈ, గగనమణిః= ఆకాశభూషణమగు సూర్యుడు, శర్మ=సుఖమును (ఇచ్చి), వః=మిమ్ములను (పాఠకులను) అనిశమ్=ఎల్లవేళలా, పాతు=రక్షించుగాక!

**తాత్పర్యము:-** సూర్యుడు-కలత నిద్రచేతను, పీడకలలచేతను బాధింపబడువారికి ఆశ్వాసమును కలిగించును. ముల్లోకాల చీకట్లను తొలగించును. పాపకలుషితుల పాపములను పరిహరించును. నిరంతర ప్రయాణములు కారణములుగా విరహవ్యథ పెంపొందగా, అలిగిన పద్మినీప్రియల-మన స్తాపమును తొలగించు నేర్పుకలవాడు. ప్రపంచమందలి దుఃఖమును తొలగించుటయను గొప్ప వ్రతదీక్ష కలవాడు. గగనమునకు గొప్ప అలంకారముగా వెలుగొందు సూర్యభగవానుడు మీకు రాత్రింబవళ్ళు సుఖములనిచ్చి రక్షించుగాక!

**విశేషములు:-** 1) కొందరు సుఖనిద్రను పొందలేరు, కలతనిద్రవలన బాధింప బడుదురు. కొందరికి నిద్రలో పీడకలలే వస్తాయి. పై ఉభయులు నిద్రా బాధితులే. ఇట్టివారికి సూర్యుడు ప్రబోధము ద్వారా దుఃఖమును తొలగించి సుఖమును కలుగచేయును. కలలో సింహము కనపడవచ్చునను భీతితో ఏనుగులు నిద్రను కూడ వదిలివేయునని ప్రతీతి కలదు. 2) రోగార్తుల రోగములు సూర్యోదయముతో నుపశమించుట కలదు. వైద్యులు కూడా 'తెల్లవారితే కాని ఏమీ చెప్పలేము' అంటుంటారు. సూర్యోదయానికి రోగం తగ్గితే ఇక క్రమంగారోగి కోలుకునే అవకాశం ఏర్పడుతుందనేది ఇచటి సూచన. జాగ్రత్తగా పరిశీలిస్తే ఉచ్ఛ్వాస నిశ్వాసాలక్రమంలో రాత్రికి పగటికి ప్రత్యేక భేదం కనపడుతుంది. కనుక సూర్యుడు రోగాపహర్త. 3) రాత్రి పాపపుటాలోచనలకు నెలవు. హత్యలు, దొంగతనాలు, వ్యభిచారం వంటి దురాచాలకు రాత్రి పుట్టినిల్లు. సూర్యోదయంతో దురాలోచనలు క్రమంగా అంతరిస్తుంటాయి. 4) ప్రియుని వియోగము ప్రియురాలికి సహించరానిదిగా ఉంటుంది. సూర్యుడు నిరంతరం ప్రయాణశీలి. కనుక పద్మినులకు అలకలు అలవాటులోనివే. ఇట్టి యలకలును పరిహరించి

మోదాన్నిపంచి యిచ్చే చాతుర్యం సూర్యుని సొత్తు. దీనిని 'కాన్తానువర్తనచాతురి' అంటారు. 5) కుపిత కమలినీ శబ్ద మహిమచే నిచట కుపిత నాయికను అనునయించెడి నాయకుని వృత్తాంతము, అప్రస్తుతమైనను స్ఫురించుచుండుటచే నిచట సమాసోక్తి యనునర్థాలంకారమున్నది.

**అవతారిక:-** మిహిరకరముల అఘటన ఘటనా సామర్థ్యమిచట ప్రస్తుతింప బడినది.

**శ్లో॥ అన్తర్నీరం నదీనామనుదినముదయే బిమ్బితా యే సమన్తా**
**ద్గీర్వాణాద్రేరుదఞ్చన్మణిగణజటిలాం మేదినీం దర్శయన్తి।**
**విప్రప్రోత్క్షిప్తసన్ధ్యాఞ్జలిజలకణికాజాలమాకాశమధ్యే**
**మాణిక్యవ్రాతయన్తో మమ మిహిరకరా మాన్ద్యమున్మూలయన్తు॥ 13**

**ప్రతిపదార్థము:-** యే=దినకర కిరణములు, అనుదినమ్=ప్రతిరోజు, ఉదయే=ప్రాతఃకాలమున, నదీనామ్=నదులయొక్క, అన్తర్నీరమ్=నీటిలోపల, సమన్తాత్=అంతటా, బిమ్బితాః=ప్రతిఫలించినవై, ఉదఞ్చ..... జటిలామ్ - ఉదఞ్చత్=ఎగసి పడుచున్న, మణిగణ=మాణిక్య సమూహములచే, జటిలామ్=పరివ్యాప్తమయిన, గీర్వాణాద్రేః=మేరు పర్వతమునకు సంబంధించిన, మేదినీమ్=భూమిని, దర్శయన్తి =చూపుచున్నవో, విప్ర..... జాలమ్ - విప్ర=బ్రాహ్మణులచే, ప్రోత్క్షిప్త =పైకెత్తబడిన, సన్ధ్యాఞ్జలి=సంధ్యాకాలమున సూర్యునికి సమర్పింపబడెడు నీటి దోసిల యందలి, జలకణికా జాలమ్=నీటి కణికల సమూహమును, ఆకాశ మధ్యే=ఆకాశమునుండి భూమి మీదకు జాలువారులోపల, మాణిక్య వ్రాతయన్తః=మణి సమూహముల వలె స్ఫురింపచేయు, మిహిర కరాః=రవి కిరణములు, మమ=నా యొక్క మాన్ద్యమ్=జడత్వమును, ఉన్మూలయన్తు=నశింపచేయుగాక!

**తాత్పర్యము:-** ప్రాతఃకాలమున రవి కిరణములు నదులలోని నీటియందు పలుచోట్ల వేలవిధముల ప్రతిబింబించును. అపుడా నీరు రత్నకాంతులను వెద జల్లును. రవి కిరణ స్పర్శచే రత్నసానువగు సుమేరు పర్వత ప్రదేశములు కూడ స్వకీయ రత్నప్రభలచే మిక్కిలి శోభిల్లును. విప్రులు ప్రాతస్సంధ్యలందు సూర్యుని పూజించుచూ తమ దోసిళ్ళతో మంత్రపూతజలమును సమర్పించుచుందురు. అట్టి నీరు భూమిని పొందులోపల, ఆకాశమున వివిధ కణికాకారములను

పొందును. అట్టియెడ వాటియందు సూర్యకాంతి ప్రతిఫలించి, ఆ జలకణికలు మాణిక్యములవలె భాసించును. ఇట్టి రవికిరణములు తనలోని జడత్వమును పోగొట్టి ఉత్సాహమును కలుగచేయవలెనని కవి సంప్రార్థించుచున్నాడు.

**విశేషములు:-** 1) ప్రాతఃకాలమున సూర్యుని ప్రతిబింబములు, నదీజలము లందనేకచోట్ల పలువిధములుగ కనిపించి కనువిందుచేయును. అనంత ప్రతిబింబము లనంత సూర్యులున్న భ్రాంతిని కలుగచేయును. ఇది యొక అపురూప సుందర దృశ్యము. ఇచట స్వభావోక్తియలంకారము. 2) మణి కాంతులు కూడ రవికిరణ సంస్పర్శచే మిరుమిట్లు గొల్పును. రవి కిరణస్పర్శలేనిచో వానికంత శోభ యుండదు. 3) సంధ్యాంజలి నుండి జాలువారిన జల కణికలు మాణిక్యములో యనిపించుననుటచే నిచట ఉత్ప్రేక్షాలంకారము. 4) మాన్ద్య మనగా జడత్వము. అది అచేతన ధర్మము. రాత్రిచే సచేతనులు గూడ మాంద్యము ననుభవింతురు. ఇట్టి మాంద్యము రవి కిరణ స్పర్శచే తొలగిపోవును. జీవుల జఠరాగ్నియందున్న అగ్నిమాంద్యమును తొలగించి ఆకలిని పుట్టించు వాడునూ సూర్యభగవానుడే. సూర్యప్రతాపమధికముగనుండు గ్రీష్మ సమయమున జఠరాగ్ని యుద్దీప్తమగుటయు, వర్షాదులయందు జఠరాగ్ని మందగించుటయు అనుభవ సిద్ధము.

**అవతారిక:-** పద్మినీ వల్లభుడగు సూర్యుడు ప్రియులకు ధైర్య స్థైర్యముల నను గ్రహింపవలెనని జగన్నాథ కవి యభిలషించుచున్నాడు.

**శ్లో॥ ప్రత్యగ్రోఢాః ప్రగల్భా యువతిపరిషదః ప్రోషితప్రాణనాథా**
**యస్మిన్నస్తాద్రిమౌలేరుపరిమణిమయచ్ఛత్రలీలాం దధానే।**
**సత్రాసం సప్రసాదం పరిణతకరుణం లోచనాన్యుత్క్షిపన్తి**
**స్థేమానం స ప్రియాణాం ఘటయతు భగవాన్పద్మినీవల్లభో వః॥ 14**

**ప్రతిపదార్థము:-** యస్మిన్=సూర్యభగవానుడు, అస్తాద్రిమౌలేః=పడమటి పర్వతపు శిఖరము యొక్క, ఉపరి=పై భాగమునందు, మణిమయచ్ఛత్రలీలామ్=మణులతో పొదగబడిన గొడుగుయొక్క విలాసమును, దధానే=పొందియుండగా, ప్రత్యగ్రోఢాః =కొత్తగా పెళ్ళి చేసుకొన్నవియు, ప్రగల్భాః=ప్రౌఢములును అయిన, ప్రోషిత ప్రాణనాథాః=ప్రియుని ఎడబాసిన, యువతిపరిషదః=తరుణీ సమూహములు,

సత్రాసమ్=భయముతోను, సప్రసాదమ్=సంతోషముతోను, పరిణతకరుణమ్=జాలికలిగించునట్లును, లోచనాని=నేత్రములను, ఉత్క్షిపన్తి=పైకెత్తుచున్నవో, సః=అట్టి, పద్మినీవల్లభః=కమలాప్తుడయిన, భగవాన్=సూర్యభగవానుడు, వః=మీ యొక్క, ప్రియాణామ్=ప్రియులకు, స్థేమానమ్=ధైర్యమును, ఘటయతు=సమకూర్చు గాక!

**తాత్పర్యము:–** సాయంసంధ్యవేళలో అస్త్రాద్రి నధిరోహించిన సూర్యుడు మాణిక్య ఛత్రము వలె మరులు గొల్పును. అట్టి సూర్యుని నవోఢలు ప్రగల్భలు విరహిణులు నగు యువతి సమూహములు భయముతో ఆనందముతో, దైన్యముతో కళ్ళు పైకెత్తి కనుగొనుచుందురు. అట్టి మీ ప్రియలకు పద్మినీవల్లభుడగు సూర్య భగవానుడు ధైర్య స్థైర్యముల ననుగ్రహింపవలెనని కవి సంభావించుచున్నాడు.

**విశేషములు:–** 1) సాయం సంధ్య కమనీయదృశ్యము. అస్త్రాద్రిచేరిన సూర్యుని మణిమయ ఛత్రముగా సంభావించుట గొప్పయుత్ప్రేక్ష. 2) ఇట్టి సమయమున ప్రియుని కొరకు పరితపించు ప్రియురాండ్ర మానసికావస్థలు విచిత్రముగ నుండును. కొందరుత్కంఠితలు కాగలరు. మరికొందరు భయమును మాత్రమే పొందగలరు. నేటికి ప్రియునితో సమాగమముండదు కదా! యనునది వారి భయము. ప్రౌఢాంగనలు రవియంద చందముల నాస్వాదించుచూ ప్రియ సన్నిధానము లేదని దీనమానసలగుదురు. సంయోగ వియోగములు సుఖ దుఃఖములు పూర్వజన్మకర్మపరిపాక రూపములు. అయిననూ సూర్యుడు పద్మినీ వల్లభుడు కనుక ప్రియుల కష్ట సుఖముల నెరిగినవాడు. సంయోగమును కల్పించుటకును, వియోగమున ధైర్యమునైన కల్పించుటకు అతడే సమర్థుడు. 'భగవాన్' అను విశేష్యమునకు 'పద్మినీవల్లభుడు' అను నీవిశేషణము సాభిప్రాయముగనున్నది. కనుక నిచట పరికరాలంకారము.

సాయంసంధ్య కమనీయముగ వర్ణింపబడుటచే నిచట 'స్వభావోక్తియు' కలదు. విప్రలంభ శృంగార మిచట యభివ్యక్తమగుచున్నది. ఇదియును భక్తి భావాంగమేయగును.

**అవతారిక:–** భూసురవంద్యుడు అంధకారాపహర్త తేజోరూపుడు అయిన సూర్యుని దేవతామూర్తికి కవి నమోవాకము లర్పించుచున్నాడు.

శ్లో॥ అన్తర్ద్యావాపృథివ్యోరధిరజని భృతానన్ధకారానుదారా
న్విద్రావ్య ద్రాక్తదీయైరివ జగదరుణం శోణితైర్వ్యద్విధత్తే।
సాయం ప్రాతశ్చ సన్ధ్యాఞ్జలిమవనిసురాస్సమ్ప్రయచ్ఛన్తి యస్మై
తస్మై కస్మైచిదేతన్మమ పరమహసే దేవతాయై నమోఽస్తు॥ 15

ప్రతిపదార్ధము:- యత్=ఏ తేజస్సు, అధిరజని=రాత్రులందు, అన్తర్ద్యావాపృథివ్యోః =భూమ్యాకాశముల మధ్య భాగమున, భృతాన్=వ్యాపించిన, ఉదారాన్=విశాలము లయిన, అన్ధకారాన్=చీకట్లను, ద్రాక్=శీఘ్రముగ, విద్రావ్య=తరిమివేసి, తదీయైః =చీకట్లకు సంబంధించిన, శోణితైః ఇవ=రక్తధారల చేతనోయనునట్లు, జగత్= ప్రపంచమును, అరుణమ్=రక్తవర్ణముతో నిండినదిగా, విధత్తే=చేయుచున్నదో, యస్మై=ఏ తేజస్సునకు, అవనిసురాః=భూసురులు (బ్రాహ్మణులు) ప్రాతః =ఉదయమున, సాయం+చ=సాయంకాలమున కూడ, సన్ధ్యాఞ్జలిమ్=సంధ్యా కాలమున చేయు అర్ఘ్యప్రదానమును, సంప్రయచ్ఛన్తి=సమర్పించుచున్నారో, కస్మైచిత్=మిక్కిలి ప్రత్యేకమైన, తస్మై=చెప్పబడిన లక్షణములు కల, దేవతాయై= దేవతా స్వరూపమగు, పరమాహసే=గొప్పతేజస్సునకు, మమ=నా యొక్క ఏతత్= ఈ, నమః=ప్రణామము, అస్తు=అగుగాక!

తాత్పర్యము:- రాత్రులందు భూమ్యాకాశముల మధ్యభాగమున గాఢముగ చీకట్లు వ్యాపించినవి. వానిని సూర్యుడు పారద్రోలినాడు. మరియు జగత్తును అరుణ వర్ణముతో నింపినాడు. ఈ అరుణవర్ణము చీకట్ల నుండి జాలువారిన రక్తమువలె భాసించుచున్నది. బ్రాహ్మణులు ప్రాతస్సాయంసంధ్యలందు సూర్యభగవానుని కర్ఘ్యప్రదానము చేయుదురు. ఇట్టి అతివిలక్షణమయిన దేవతారూపమైన గొప్ప తేజస్సునకు నమస్కరించుచు కవి తన భక్తి నావిష్కరించుచున్నాడు.

విశేషములు:- 1) రాత్రులందు చీకట్లు వ్యాపించుట, ప్రాతఃకాలమున అరుణోదయవేళ జగత్తంతయు నరుణవర్ణము దాల్చుట ప్రకృతి సిద్ధము. అరుణ వర్ణవ్యాప్తికి కారణము అరుణోదయమేగాని చీకట్ల నుండి జారిన శోణితము కాదు. కారణము కాని దానిని కారణముగా నూహించుటచేనిచట హేతూత్ప్రేక్షాలంకారమున్నది. 2) భూసురులు జగద్వంద్యులు వారిచే నుభయ

సంధ్యలందు నుపాసింపబడు సూర్యుడు వంద్యులకు వంద్యుడు. 3) ఇచటి యుత్ప్రేక్ష భక్తిభావమునకు పోషకము.

**అవతారిక:-** త్రిగుణములకు వేదత్రయమునకు అతీతమగు భాస్కరుని దివ్యతేజము నిన్ను రక్షించుగాక యని కవి యాశాసించుచున్నాడు.

**శ్లో॥** **త్రాణం త్రైవిష్టపానాం తరణమథ పయస్తోమతామ్యత్తనూనాం**
**వేదానామప్రతర్క్యత్రిగుణమయతయా యత్త్రయాణాం తురీయమ్।**
**తత్తాదృక్తున్దిలాయాస్తరుణతరతమస్సన్తతేరన్తకృత్త్వాం**
**తేజస్త్రైలోక్యతామ్రీకరణచతురిమ త్రాయతాం తీక్ష్ణభానోః॥ 16**

**ప్రతిపదార్థము:-** త్రైవిష్టపానామ్=స్వర్గమందుండెడి దేవతలకు, త్రాణమ్=రక్షకమును, అథ=మరియు, పయస్తోమ..... తనూనామ్ - పయస్తోమ=నీటి సమూహములచే, తామ్యత్=పీడింపబడుచున్న, తనూనామ్=శరీరములు కలవారికి, తరణమ్=దుఃఖనివారకమును, త్రయాణామ్=మూడు సంఖ్యకల, వేదానామ్=ఋగాది వేదములకు, అప్రతర్క్య.....తయా - అప్రతర్క్య=ఊహింపనలవికాని, త్రిగుణమయతయా=సత్వరజస్తమో రూపములుండుటచేత, యత్=ఏ తేజస్సు, తురీయమ్=నాల్గవదిగా చెప్పబడుచున్నదో, తాదృక్=అంతటి, తున్దిలాయాః=బలిసిన, తరుణ......సన్తతేః - తరుణతర=మిక్కిలి సాంద్రమగు, తమః=చీకట్లయొక్క, సన్తతేః=సమూహమునకు, అన్తకృత్=వినాశకమగు, త్రైలోక్య ...... చతురిమ - త్రైలోక్య=ముల్లోకములను, తామ్రీకరణ=రాగి వర్ణము కలవిగా చేయుటయందు, చతురిమ=నేర్పుకల, తత్=ప్రసిద్ధమయిన, తీక్ష్ణభానోః =ప్రచండకిరణుడగు సూర్యుని యొక్క, తేజః=వెలుగు, త్వామ్=నిన్ను, త్రాయతామ్=రక్షించుగాక!

**తాత్పర్యము:-** ప్రచండకిరణుడగు సూర్యుని తేజస్సు దేవతలకును రక్షకము. జలరాసులలోను సంసారసాగరమున మునిగి పీడింపబడు వారికి యీ తేజస్సు పడవవలె దాటించునది. మూడు వేదములు ఊహింప శక్యము కాని సత్వ రజస్తమో రూపములైన త్రిగుణముల నావిష్కరించుటకు సమర్థములు. సూర్యతేజము త్రిగుణాతీతము కనుకనే తురీయమని చెప్పదగినది. ఎంతటి

చిక్కనివైనను అంతట వ్యాపించిన చీకట్లను సమూలముగ నశింపచేయున దీ తేజస్సు. అట్లే ముల్లోకములకు రాగిరంగు నద్దుటలో సమర్థ మీ తేజము. అట్టి తీక్ష్ణాంశుని ప్రచండ తేజము నిన్ను రక్షించుగాక!

**విశేషములు:-** 1) వేదములు త్రిగుణ విషయములనే ప్రతిపాదించుననియు, త్రిగుణాతీత స్థితియందు మాత్రమే మోక్షము సిద్ధించుననియు, భగవద్గీతయందు శ్రీ కృష్ణభగవానుడర్జునున కుపదేశమొనర్చినాడు. సూర్యుడు త్రిగుణాతీతుడు తురీయ శబ్దవాచ్యుడని వర్ణింపబడుటచే పరతత్త్వ స్వరూపుడని తెలియు చున్నది. 2) త్రిగుణాత్మకులగు బ్రహ్మ విష్ణు మహేశ్వరుల తేజముకంటె సూర్యాత్మకమగు నీ తేజము పరమవిశిష్టమని ధ్వనించుచున్నది. 3) త-ర-ణ అను స్వారముల యావృత్తిచే నిచట అనుప్రాసము శబ్దాలంకారమయినది. ఇది భక్తి భావాంగము.

**అవతారిక:-** దేవ-గంధర్వులచే ప్రశంసింపబడునవి, రోగార్తి నపహరించునవి యగు సూర్యకిరణ విలాసములు దుఃఖాపనోదకములుగా నిచట కీర్తింపబడినవి.

**శ్లో॥** గీర్వాణ గ్రామణీభిర్గగనతలగతైర్గీర్భిరుద్గీథగాభి
ర్గన్ధర్వైశ్చాపి గీతా గుణగణగరిమోద్గారిగాథాసహస్రైః।
గాహంగాహం గృహాలీరగతికగదినాం గన్ధయన్తో గదార్తిం
గ్లానిగ్రామం గ్రసన్తాం గ్రహరుచిగురవో గోపతేర్గోవిలాసాః॥ 17

**ప్రతిపదార్థము:-** గగన తల గతైః=ఆకాశమందున్న, గీర్వాణ గ్రామణీభిః=దేవతా ముఖ్యులచేత, ఉద్గీథగాభిః=సామవేదానుగుణములగు, గీర్భిః=వాక్కులచేతను, గన్ధర్వైః+చ=గంధర్వులచేత, గుణగణ...... సహస్రైః - గుణ=సుగుణముల యొక్క, గణ=సమూహములయొక్క గరిమా=మహిమను, ఉద్గారి=వ్యక్తీకరించెడు గాథా=పాటలయొక్క (గాథాఛందస్సున రచింపబడిన శ్లోకముల యొక్క) సహస్రైః =వేలచేతను, అపి=కూడ, గీతాః=పాడబడుచున్నవియు, గృహాలీః=ఇళ్ళ సముదాయములను, గాహం గాహమ్=లోలోపలికి ప్రవేశించి, అగతిక గదినామ్ - అగతిక=మార్గాంతరములేని (నివారణోపాయముకానరాని) గదినామ్= రోగములు కలవారి యొక్క, గద+ఆర్తిమ్=రోగ దుఃఖమును, గన్ధయన్తః=నశింప చేయుచున్నవియు, గ్రహరుచిగురవః - గ్రహ=చంద్రాదిగ్రహములయొక్క, రుచి=

కాంతులయందు, గురవః=ప్రశస్తములగు, గోపతేః=సూర్యుని యొక్క గోవిలాసాః =కాంతి వైఖరులు, గ్లానిగ్రామమ్=దుఃఖ సమూహములను, గ్రసన్తామ్=మ్రింగి వేయుగాక! (నశింపచేయుగాక!)

**తాత్పర్యము:**- సామగాన విశారదులగు దేవతాముఖ్యులచేతను, గానకలాప్రవీణు లగు గంధర్వులచేతను సహస్రకిరణుని కిరణవిలాసములు వేలకొలది శ్లోకము లతో పాటలతో గుణగణమహిమ యుట్టిపడునట్లు పాడబడుచున్నవి. ఈ కిరణములు గృహాభ్యంతరములందున్న మారుమూల ప్రదేశములందు కూడ ప్రవేశించి రోగుల రోగార్తిని నశింపచేయుచున్నవి. సూర్యాదినవగ్రహముల కిరణములలో సూర్యకిరణములకు సాటిరాగల కిరణములు లేవు. అట్టి అంశుమంతుని కిరణ విలాసములు దుఃఖములను నశింపచేయవలెనని కవి భావము.

**విశేషములు:**- 1) వేదమంత్రములు దేవతలను స్తుతించును. అందు సామములు గానప్రధానములు. సామగాన నిపుణులగు దేవతలు రవికిరణ విలాసములను స్తుతించుచున్నారని వర్ణించుటచే సూర్యభగవానుడు వేదవేద్యులకును స్తుత్యు డనియూ, సర్వాధికుడనియు నభివ్యక్తమగుచున్నది. 2) గంధర్వులు గానకళా ప్రవీణులు, గొప్ప గాయకుని ప్రశంసించుటకు 'గానగంధర్వు' డని చెప్పుదురు. అట్టి గాన గంధర్వులచే వేలకొలది గీతములు రచింపబడి రవి కిరణములు ప్రశంసింపబడుచున్నవి. వేలకొలది గీతములచే - నని చెప్పుటవలన రవి కిరణ విలాసముల అనంతత్వము రమ్యత వ్యక్తమగుచున్నది. 3) రవి కిరణములు ప్రవేశింపని ప్రదేశము లేదు. అవి సర్వవ్యాపకములు. కనుకనే ఇండ్లలో మారుమూల ప్రదేశములందు కుములుచున్న దీర్ఘరోగుల రోగార్తిని కూడ నుపశమింపచేయుచున్నవి. సర్వవ్యాపకత్వము పరబ్రహ్మలక్షణము. 4) సూర్యుని చుట్టు చంద్రాది గ్రహములు నిర్దిష్టకక్ష్యలలో పరిభ్రమించుచున్నవి. అందు సూర్యుడు గ్రహరాజు మరియు చండ కిరణుడు. సూర్యునికి సమీపము నందున్న గ్రహము స్వకాంతి వైశిష్ట్యమును కోల్పోవును. ఆ గ్రహప్రభావము అస్తమించును. ఇది జ్యోతిశ్శాస్త్రమున సుప్రసిద్ధము. గ్రహరుచి గురవః - అనుమాట దీనిని తెలియపరచుచున్నది. కనుకనే దుఃఖసమూహములను కూడ రవి కిరణము లస్తమింప చేయగలవనుటలో సందేహము లేదు.

**అవతారిక:**-చండకిరణుడు జాడ్యాపహుడు జీవ జీవనుడునగు సూర్యభగవానుడు జయమును ప్రసాదింపవలెనను కవి యాకాంక్ష ఇచట వ్యక్తమగుచున్నది.

**శ్లో॥ జీవాతుర్జాడ్యజాలాధికజనితరుజాం తప్తజాము్బనదాభం**
**జజ్ఘాలం జాఙ్ఘికానాం జలధిజఠరతో జృమ్భమాణం జగత్యామ్।**
**జీవాధానం జనానాం జనకమథ రుచో జీవజైవాతృకాదే**
**ర్జ్యోతిర్జాజ్వల్యమానం జలజహితకృతో జాయతాం వో జయాయ॥ 18**

ప్రతిపదార్థము:- జాడ్య ..... రుజామ్ - జాడ్య=1) జడత్వము యొక్క, 2) రోగముల యొక్క, జాల=సమూహములచే, జనిత=పుట్టిన, రుజామ్=తీవ్ర రోగములతో బాధపడువారికి, జీవాతుః=ప్రాణనాడివంటిది, తప్తజాము్బనదాభమ్=కరగించిన బంగారము వంటి మేలిమి కాంతి కలది, జాంఘికానామ్=మిక్కిలి వేగముగ ప్రయాణించగల వారిలో, జంఘాలమ్=వేగవత్తమము, జలధి జఠరతః=సాగరగర్భమునుండి, జగత్యామ్=విశ్వమునందు, జృమ్భమాణమ్=విజృంభించునది, జనానామ్=ప్రాణులకు, జీవాధానమ్=జీవనమును కలుగ చేయునది, అథ=మరియు, జీవజైవాతృకాదేః=గురుచంద్రాది గ్రహముల యొక్క రుచః=కాంతికి, జనకమ్=ఉత్పత్తి కారణము, జాజ్వల్యమానమ్=దేదీప్యమానమగు, జలజహితకృతః=పద్మబాంధవునియొక్క, జ్యోతిః=వెలుగు, వః= మీ యొక్క, జయాయ=అభ్యుదయమునకు, జాయతామ్=సమర్థమగు గాక!

**తాత్పర్యము:**- రవితేజము జాడ్యముచే రోగముల బారిన పడిన వారికి ప్రాణనాడివలె పరమోత్తేజకము. ఆ తేజము మేలిమి బంగరు కాంతులతో వెలుగొందును. ఆ తేజోవేగమునకు సాటిరాగల వేగము మరియొకటి కానరాదు. ఆ తేజము సాగర గర్భమునుండి బయల్వెడలి విశ్వమంతయు విజృంభించును. ఈ తేజము జనులకు జీవచైతన్యమును జీవనమును కలిగించును. గురుచంద్రాది గ్రహములకు వాని తేజములకు సూర్యతేజమే చైతన్య హేతువు. అట్టి పద్మబంధుని ప్రచండ తేజము మీకు జయమును కలుగ చేయు గాక!

**విశేషములు:**- 1) రోగ నివారణకు సూర్యకాంతికి అవినాభావ సంబంధము

కలదు. చాలా రోగముల కజీర్ణమనునది మూల కారణము. అజీర్ణము జఠరాగ్ని మాంద్యము వలన కలుగును. దీనిని ఆయుర్వేదమున 'అగ్నిమాంద్యము' గా వ్యవహరింతురు. జఠరాగ్ని యొక్క మాంద్యమును తొలగించుటకు సూర్యుని తేజస్సు గొప్పసాధనము. సూర్యతేజ మధికమగ నుండు గ్రీష్మకాలమున ఇట్టి రోగములు సహజముగనే ఉపశమించును. కనుకనే రోగార్తులకు సూర్యుడు జీవాతువుగా చెప్పబడినాడు. 2) లోకమున ప్రసిద్ధములగు వాయువేగాదులకన్న సూర్యుని కాంతి వేగము మిక్కిలి గొప్పది. కాంతి కన్న వేగముగ ప్రయాణించు పదార్థమేదియు లేదు. ఇది ఆధునిక శాస్త్రసమ్మతమగు సత్యము. మనోవేగ మనునది గొప్పదిగా చెప్పబడు చున్నను దానికి వ్యావహారికసత్తయే గాని పారమార్థిక స్థితి లేదు. 3) భూమి తన చుట్టూ, తాను పరిభ్రమించుచూ, సూర్యుని చుట్టూ కూడ తిరుగుచున్నది - అనునది శాస్త్రీయ సత్యము. కాని సూర్యుడే భూమిచుట్టు పరిభ్రమించుచున్నట్లు కన్నుల కగుపించును. అట్లే సూర్యుని ఆవిర్భావము లేగా ప్రథమ దర్శనము భూమండలమున ముప్పాళ్ళు వ్యాపించిన జలరాశినుండియే జరుగుచున్నదనుట పారమార్థికము కాకున్నను ప్రత్యక్ష గోచరము. 4) సూర్యుని తేజము జల జీవాధానము. జీవమనగా ప్రాణము జలము అను రెండర్థములున్నవి. జలము ప్రాణాధారము. సూర్యరశ్మిచే యావిరి యయిన సముద్రాది జలము మేఘరూపమున వర్షసృష్టి చేయుటచే సూర్యరశ్మి జీవాధానమయినది. 5) సూర్యుడు గ్రహరాజనుట నిర్వివాదము. సూర్యుని యాకర్షణ శక్తియే చంద్రాది గ్రహములను సూర్యునిచుట్టూ పరిభ్రమింపచేయు చున్నదనుట సర్వసమ్మతము.

**అవతారిక:-** గోవులు పరమపవిత్రములు, పావనములు. అట్లే రవి కిరణములును పావనములు. మహిమా న్వితములగు వాసరేశుని కిరణములు పాఠకులకు కల్యాణమును కలిగింపవలెనని కవి యభిలషించుచున్నాడు.

శ్లో॥ ప్రాతర్నిర్గత్య గోభిస్సహ రుచివిషయే సఞ్చరన్త్యోఽహ్ని తాభి
స్సాకం సాయం నికాయం ప్రతి పునరపి యాస్సంప్రయాతుం త్వరన్తే।
యాసాం దివ్యప్రభావస్త్రిజగదఘవనశ్రేణిదావైకదావః
క్షేమం తన్వన్తు తా వశ్శివమయవపుషో వాసరేశస్య గావః॥ 19

**ప్రతిపదార్థము:–** ప్రాతః=ప్రభాత సమయమున, గోభిః+సహ=అవులతో కూడి, నిర్గత్య=బయల్వెడలి, అహ్ని=పగటిపూట, తాభిః+సహ=గోవులతోడనే, రుచి విషయే=1) తమకు రుచించెడు నాహారముండు తావుల, 2) కాన్తి ప్రసార యోగ్యములగు ప్రదేశములందు, సఞ్చరన్త్యః=ప్రయాణించుచున్న, యాః=1) ఏ గోవులు, 2) కిరణములు, పునః=తిరిగి, సాకమ్=(గోవులతో) కూడి, నికాయం ప్రతి=నివాసస్థానమును గూర్చి, సంప్రయా తుం అపి=ప్రయాణించుటకును, త్వరన్తే=తొందరపడుచున్నవో, యాసామ్=1) గోవుల యొక్క, 2) కిరణముల యొక్క, దివ్యప్రభావః=అసామాన్యమహిమ, త్రిజగదఘవన.... దావః – త్రిజగత్=ముల్లోకములయొక్క, అఘ=పాపములనెడు, వన=అరణ్యముల యొక్క, శ్రేణి=వరుసలను, దాహ=మండించుటయందు, ఏకదావః=అద్వితీయ మగు కార్చిచ్చో, తాః=అట్టివగు, శివమయవపుషః=శుభకరములగు శరీరములతో నొప్పు, వాసరేశస్య=దినపతియొక్క, గావః=కిరణములు, వః=మీకు, క్షేమమ్=సుఖమును, తన్వన్తు=పెంపొందించుగాక!

**తాత్పర్యము:–** ఆలమందలు ఉదయముననే తమతమ నెలవుల నుండి బయలుదేరి, తమకిష్టమగు నాహారమున్నతావుల పగటిపూట సంచరించి, సాయంసమయాన తిరిగి తమ నివాసములను చేరుకొనుటకు త్వరపడు చుండును. సూర్యకిరణములును గోవులవలె ప్రాతఃకాలమున బయటకు వచ్చి, కాంతులు ప్రసరింపదగు ప్రదేశములన్నిట కాంతి ప్రసారము చేసి, సాయం సమయమున తమ నివాసమున కరుగును. గోవులు స్వతః పవిత్రములు మరియు పావనములు. ముల్లోకముల పాపములను మహారణ్యములను దహించుటలో గోవులు కిరణములు కూడ కార్చిచ్చువలె దివ్యప్రభావమును కలిగించును. ఇట్టి దినపతి యొక్క కళ్యాణకరములగు గోవులవంటి కిరణములు మీకు సుఖమును శాంతిని కలిగించవలెనని జగన్నాథుని తాత్పర్యము.

**విశేషములు:–** 1) ఇచట సహోక్తి శ్లేషల సహకారమున ఉపమాలంకారము ధ్వనించుచున్నది. 2) గో శరీరము సకల దేవతా నివాసమనియు, గోపంచకము పవిత్రమును పాతక పరిహారకమును అగుననియు, గోపూజ సుఖశాంతులను కలుగ చేయుననియు హిందువుల విశ్వాసము. గోశబ్దమునకు అవులు

కిరణములు అను రెండర్థములు కలవు. అన్ని విధముల గోవుల వంటివి కనుకనే కిరణములును పవిత్రతను సుఖశాంతులను కలుగచేయునని కవి యాశయము. 'శివమయ వపుషః', 'త్రిజగదఘవన శ్రేణి దాహైక దావః', అను విశేషణము లర్థవిశేషమునకు వ్యంజకములయినవి.

**అవతారిక:-** మానవులనుండి దేవతలవరకు అందరిచే రవిబింబము భక్తి ప్రపత్తులతో నారాధింపబడుచున్నది. ప్రత్యక్ష దైవమగు నుద్యదర్కబింబము తమోరూపమగు అవిద్యను తొలగించవలెనని కవి సంభావించుచున్నాడు.

**శ్లో॥ వృన్దైర్వృన్దారకాణాం దనుజతనుజుషాం రక్షసాఞ్చ క్షపాన్తే**
**గన్ధర్వాణాం ధురీణైః ప్రణతమహివరైః కిన్నరైర్యన్నరైశ్చ।**
**విద్యాం హృద్యాం నిజేభ్యో వితరదవిరతం దీప్తిభిర్దీపయద్వ్యా**
**మద్యాదాద్యామవిద్యామిదముదయగిరేరుద్యదర్కస్య బిమ్బమ్॥ 20**

**ప్రతిపదార్థము:-** క్షపాన్తే=రాత్రి యొక్క అంతమునందు, వృన్దారకాణామ్=దేవతల యొక్కయు, దనుజతనుజుషామ్=దానవుల యొక్కయు, రక్షసాంచ=రాక్షసుల యొక్కయు, వృన్దైః=సమూహములచేత, గన్ధర్వాణామ్=గంధర్వులను దేవతా విశేషములలో, ధురీణైః=శ్రేష్ఠులచేతను, అహివరైః=సర్పముఖ్యులచేతను, కిన్నరైః=కిన్నరులుగా పిలువబడు దేవతల చేతను, నరైశ్చ=మానవుల చేతను, ప్రణతమ్=నమస్కరింపబడినదో, యత్=ఏ బింబము, హృద్యామ్=మనోహరమైన, విద్యామ్=జ్ఞానమును, నిజేభ్యః=తనవారికి, అవిరతమ్=ఎడతెరపిలేక, వితరత్=ఇచ్చుచున్నదో, యత్=ఏరవిబింబము, దీప్తిభిః=కాంతులతో, ద్యామ్=1) స్వర్గమును, 2) ఆకాశమును, దీపయత్=వెలిగించుచున్నదో, ఉదయగిరేః=ఉదయ పర్వతమునుండి, ఉద్యత్=ఉదయించుచున్న, ఇదమ్=ఈ, అర్కస్య=సూర్యుని యొక్క, బిమ్బమ్=మండలము, ఆద్యామ్=అనాదియగు, అవిద్యామ్=అజ్ఞానమును (మాయను) అద్యాత్=తినివేయు గాక! (నశింపచేయుగాక!)

**తాత్పర్యము:-** ఉదయార్కబింబము ముల్లోకములకు పూజ్యమే. కనుకనే దేవతలు దానవులు రాక్షసులు గంధర్వులు నాగశ్రేష్ఠులు కిన్నరులు నరులు ప్రతిరోజు ప్రాతఃకాలమున సూర్యబింబానికి ప్రణామాలర్పిస్తూ ఉంటారు. ఈ అర్కబింబము

ఆత్మీయుల కనవద్యమైన విద్యను ఎల్లప్పుడూ అందిస్తూనే ఉంటుంది. తన కాంతులతో ఆకాశాన్ని స్వర్గాన్ని వెలిగిస్తూనే ఉంటుంది. ఇట్టి మహిమాన్విత మయిన ఉద్యదర్కబింబము ప్రాణిసహజమగు అనాదియైన అవిద్యను రూపుమాపవలెనని కవి యాశయము.

**విశేషములు:-** 1) సామాన్య మానవుల నుండి జరామరణాలు లేని దేవతల వరకు విభిన్న జాతులున్నాయి. అన్ని జాతులకు ఏదో ఒక విషయంలో భేదం ఉండి తీరుతుంది. కానీ అందరికీ సూర్యబింబం మాత్రం ప్రత్యక్షదైవమే. ఇది సూర్యుని ప్రత్యేకత. సూర్యుడు జగదేక వంద్యుడని భావము. 2) సూర్య భగవానుడు శుక్ల యజుర్వేదాన్ని ఉపదేశించటం ద్వారా విద్యాప్రదానం చేసాడని సంప్రదాయం తెలియపరుస్తున్నది. 3) చీకటి ముసిరిన వేళ, కొద్ది సమయం పరిమితంగా నైనా వెలుగును పొందాలంటే ఎంత ఖర్చో ప్రయాసో అందరికీ తెలుసు. అనాదికాలం నుండి నియమబద్ధంగా సువిశాలమైన ఆకాశాన్ని స్వర్గాన్ని పరిపూర్ణమైన వెలుగుతో నింపుతూ ఉండటం ఎంతటి మహత్తర కార్యమో! అట్టి శక్తి సామర్థ్యాలున్న ఉద్యర్కబింబము జగత్పూజ్యమేకదా! 4) రవిబింబం లోకాల చీకట్లను తొలగించటం ప్రత్యక్ష సిద్ధము. అజ్ఞానాన్ని చీకటితో పోలుస్తారు. అనాది యయిన యవిద్య లేదా మాయ భ్రాంతిని కలిగిస్తూ జీవుడిని సంసార సాగరంలో ముంచి ఉక్కిరి బిక్కిరి చేస్తుంటుంది. కనుక చీకట్లను తొలగించినట్లే, చీకటివంటి అవిద్యను కూడ సూర్యభగవానుడే తొలగించగలడని కవి విశ్వాసము.

**అవతారిక:-** క్షణ లవాది రూపమగు కాలచక్రానికి వ్యవస్థాపకుడు, పదార్థముల కుత్పత్త్యాది షడ్వికారములను కలిగించువాడు, అయిన సూర్యభగవాను డిచట ప్రస్తుతింపబడుచున్నాడు.

శ్లో॥ ఆపాథోజాసనాయుః క్షణలవఘటికాద్యాత్మకం కాలచక్రం
ప్రాహుః పూర్వే పురాణాగమవిషయవిదో యస్య లీలావిలాసమ్।
భావానాం షడ్వికారానథ ఖలు గతిభిర్యశ్చ నిత్యం ప్రసూతే
స ప్రాతః పౌరుహూతే పరిలసతి హరిన్మణ్డలే చణ్డభానుః॥ 21

**ప్రతిపదార్థము:-** పురాణాగమ విషయ విదః-పురాణ=బ్రహ్మాండాది అష్టాదశ పురాణములకు, ఆగమ=వేదములకు+ధర్మశాస్త్రములకు సంబంధించిన, విషయ=ప్రతిపాద్యాంశమును, విదః=తెలిసినవారగు, పూర్వే=సనాతనులు (మహర్షులు)ఆపాథోజాసనాయుః=బ్రహ్మాయువునుండి, క్షణలవఘటికాద్యాత్మకమ్ -క్షణ=క్షణమను కనిష్ఠకాలాంశము, లవ=లవమను సూక్ష్మకాల విభాగము, ఘటికా=24 ని॥ సమయము/ఘడియ, ఆది=మొదలు, ఆత్మకమ్=రూపములు కల, కాలచక్రమ్=కాలమును సూచించు యంత్రమును, యస్య=ఏ సూర్య భగవానుని యొక్క, లీలావిలాసమ్=అనాయాసముగ చేయు చేష్టా విశేషముగ, ప్రాహుః=చెప్పుచున్నారో, భావానామ్=పదార్థములకు సంబంధించిన, షట్=ఆరు, వికారాన్=ఉత్పత్తి-వృద్ధి-క్షయాదులను, గతిభిః=తన విలక్షణ సంచారముచే, నిత్యమ్=ఎల్లవేళలా, ప్రసూతే ఖలు=ప్రసవించుచున్నాడో, సః =అటువంటి, చణ్డభానుః=తీక్ష్ణకిరణుడగు సూర్యుడు, పౌరుహూతే=ఇంద్ర సంబంధముకల, హరిన్మణ్డలే=దిక్ప్రాంతమున (తూర్పు దిక్కున) పరిలసతి= ప్రకాశించుచున్నాడు.

**తాత్పర్యము:-** క్షణ-లవ-ఘటికాదులు మొదలుకొని బ్రహ్మాయువు పర్యంతము వివిధ కాల విభాగములు సనాతనులచే ప్రతిపాదింపబడినవి. ఇట్టి కాల విభాగములన్నియు - సూర్యుని గమన చేష్టలననుసరించియే నిర్ణయింపబడును. ప్రతిపదార్థము ఉనికి-పుట్టుక-పెరుగుదల-క్షీణించుట మొదలగు మార్పులను పొందుచుండును. ఇట్టి భావ వికారములకు కూడ సూర్యుడే కర్త. ఇట్టి సూర్యుడు ఇంద్ర సంబంధమగు తూర్పు దిక్కున ప్రకాశించుచున్నాడు.

**విశేషములు:-** 1) 18 రెప్పపాట్లకాలము-1 కాష్ఠ, 30 కాష్ఠములు -1 కల (8 సె॥), 30 కలలు - 1 క్షణము (4ని॥), 12 క్షణములు - 1 ముహూర్తము (48ని॥), 30 ముహూర్తములు - 1 అహోరాత్రము, 15 అహోరాత్రములు - 1 పక్షము, 2 పక్షములు - 1 మాసము, ఇది యొక కాల మానము. ఇట్లు బ్రహ్మాయువు వరకు కాల పరిగణన చేయబడినది. ఇందు ఒక సూర్యోదయము నుండి మరొక సూర్యోదయమునకు మధ్యకల కాలప్రమాణము అహోరాత్ర మనబడును. దీని ననుసరించియే క్రిందివగు సూక్ష్మకాల

ప్రమాణములు, పైవగు పక్ష- మాస-అయన సంవత్సరాదులును ఏర్పడినవి. ఎట్టికాలమానమున కయిననూ సూర్యుని సంచారమే నిర్ణాయకము. కనుకనే కాల చక్రము సూర్యుని లీలా విలాసముగ చెప్పబడినది. 2) ప్రతిపదార్థము తమ తమ ఆయుః ప్రమాణాను గుణముగ వివిధ వికారములను పొందును. 1) పుట్టుక 2) ఉనికి 3) ఎదుగుదల 4) పరిణతి, 5) క్షీణత, 6) వినాశము అను నీ షడ్భావ వికారములు సర్వపదార్థ సాధారణములు. ఈ వికారములు ఆయా పదార్థముల / ప్రాణుల ఆయుః ప్రమాణానుగుణముగ జరుగుచుండును. ఇట్టి పరిణామములు కూడ కాలాధీనములు. కాలము సూర్యాధీనము. కనుక భావ వికారమును చేయువాడు సూర్యుడే.

**అవతారిక:**- హిమభారమును, ధర్మ విధ్వంసకులను, పాపసమూహములను నశింపచేయు చండభానుని కిరణములు రోగములను కూడ నశింపజేయ వలెనని కవి యాకాంక్షించుచున్నాడు.

**శ్లో॥ అఙ్గాని బ్రాహ్మణానాముషసి హిమభరాసఙ్గతో భఙ్గురాణి**
**వ్యాలక్ష్య ద్రాక్ప్రయాతా రిపుజనితరుషేవారుణా వాసవాశామ్।**
**ధర్మధ్వంసోద్ధురాణామఖిలమపి కులం జక్షత శ్శోభితక్ష్మా**
**యక్ష్మాణం మే హరన్తు త్వరితమఘభిదో భానవశ్చణ్డభానోః॥** 22

ప్రతిపదార్థము:-ఉషసి=ప్రాతఃకాలమున, హిమభరాసఙ్గతః=గాఢమగు మంచుతో సంపర్కము వలన, భఙ్గురాణి=వికలములగు, బ్రాహ్మణానామ్=బ్రహ్మవిదులగు విప్రుల యొక్క, అఙ్గాని=అవయవములను, వ్యాలక్ష్య=పరిశీలించి, ద్రాక్= శీఘ్రముగ, వాసవాశామ్=తూరుపు దిక్కును, ప్రయాతాః=పొందినవియు, రిపుజనితరుషా-రిపు=శత్రువువలన, జనిత=ఏర్పడిన, రుషా=కోపముచేతనో, ఇవ=అనునట్లు, అరుణాః=సిందూరవర్ణమును దాల్చినవియు, ధర్మ ధ్వంసోద్ధురాణామ్ - ధర్మ=ధర్మమును, ధ్వంస=నశింపచేయుటయందు, ఉద్ధురాణామ్=దృఢ దీక్ష కలవారియొక్క, కులమ్=సమూహమును, అఖిలమ్ =సమస్తమును, అపి=కూడ, జక్షతః=మ్రింగునవి, శోభితక్ష్మాః=భూమిని రమణీయ మొనర్చునవి, అఘభిదః=పాపవినాశకములు - అగు, చణ్డభానోః =తీవ్ర కిరణుని యొక్క, భానవః= అంశువులు, మే=నా యొక్క, యక్ష్మాణమ్= రోగమును - ఆర్తిని, హరన్తు= తొలగించు గాక!

**తాత్పర్యము:-** శిశిరమం దుషః కాలముననే లేచి నిత్యవిధులొనర్చు బ్రాహ్మణుల శరీరావయవములకు హిమసంసర్గము కారణముగ నేర్పడు బాధను గ్రహించి, తద్రక్షణార్థము సూర్యుడు తూర్పున ఉదయించినాడు. ఆత్మీయుల కహితమును చేయు శత్రువుల పట్ల రోషము చేతనోయన్నట్లు సూర్యకిరణములరుణ వర్ణమును దాల్చినవి. చండభానుని కిరణములు ధర్మవిధ్వంసకుల సమూహము లను కడతేర్చును. భూమండలమును రమ్యతర మొనర్చును. పాపములను పరిహరించును. అట్టి కిరణములు తన యార్తిని రోగమును తొలగించవలెనని కవి ప్రార్థించుచున్నాడు.

**విశేషములు:-** 1) ప్రభాతమున భానుకిరణము లరుణవర్ణము దాల్చుటకు శత్రువు మీద కోపము కారణము కాదు. అయిననూ దానిని కారణముగ సంభావించుటచే నిచట హేతూత్ప్రేక్షయను నర్థాలంకారము కలదు. "సంభావ నాస్యాదుత్ప్రేక్షా వస్తు హేతు ఫలాత్మనా" అని ఉత్ప్రేక్షాలంకార లక్షణము. 2) భాను కిరణములు తూరుపున ప్రాదుర్భవించుటకు బ్రాహ్మణుల యవయవ పీడను తొలగించుట ఫలము కాదు. అయిననూ దానిని ఫలముగా సంభావించుటచే నిచట ఫలోత్ప్రేక్షయు కలదు. 3) పైయుత్ప్రేక్షలు కవికి భానుకిరణములందు గల భక్తి భావమున కంగములు. భక్తి భావమంగి-ప్రధానము.

**అవతారిక:-** బ్రాహ్మణులకు కాముకులకు పద్మములకు పుష్పములకు సుఖసంతోషములను పంచి పెట్టెడి పగటిరాజగు సూర్యభగవానుడు మీకు సమస్త మంగళములను ప్రసాదించవలెనని కవి యాకాంక్ష.

**శ్లో॥ విశ్రాన్తిం బ్రాహ్మణానాం సుఖమతిశయితం కామినాం స్థాయిలీలా**
**మమ్భోజానాం ప్రబోధం కుసుమపరిషదాం యశ్చికీర్షన్దయార్ద్రః।**
**నిర్యాత్యన్తస్సముద్రాత్సకలమపి నృణాం భారమాధాయ వహ్నౌ**
**వహ్నేయాహ్నామధీశస్స భవతు భవతాం భూయసే మఙ్గలాయ॥ 23**

**ప్రతిపదార్థము:-** దయార్ద్రః=కరుణామూర్తియగు, యః=సూర్యభగవానుడు, బ్రాహ్మణానామ్=విప్రులకు, విశ్రాన్తిమ్=కార్యవిరామమును, కామినామ్=కోరికలు కలవారికి, అతిశయితమ్=గొప్పదగు, సుఖమ్=ఇంద్రియాహ్లాదమును,

అమ్భోజానామ్=పద్మములకు, స్థాయిలీలామ్=స్థిరమగు విలాసమును, కుసుమ పరిషదామ్=పుష్ప సమూహములకు, ప్రబోధమ్=వికాసమును, చికీర్షన్=చేయ గోరినవాడై, సకలమ్=సమస్తమైన, నృణామ్=మానవుల యొక్క, భారమ్= బరువును, వహ్నౌ=అగ్నియందు, ఆధాయ=నిలిపి, అహ్నాయ=శీఘ్రముగ, అన్తస్సముద్రాత్=సాగరాంతర్భాగము నుండి, నిర్యాతి=బయల్వెడలుచున్నాడో, సః=అట్టి, అహ్నామ్=రోజులకు, పగళ్ళకు, అధీశః=ప్రభువగు సూర్యభగవానుడు, భవతామ్=మీకు, భూయసే=అపరిమితమగు, మఙ్గలాయ=శుభము కొరకు, భవతు=అగుగాక!

**తాత్పర్యము:-** నిత్యకర్మానుష్ఠాన తత్పరులగు బ్రాహ్మణులకు విశ్రాన్తిని, ఆయాకోరికలచే బహుకార్య నిర్మగ్నులకు కాముకులకు కార్యసాఫల్యప్రదానముచే గొప్ప సుఖమును, పద్మములకు స్థిరమగు సౌందర్యవిలాసమును, పుష్ప సమూహములకు వికాసమును, దయతో చేయ గోరిన సూర్యభగవానుడు, మానవ కార్య భారము నగ్నికప్పగించి, సముద్ర గర్భము నుండి ప్రాదుర్భవించు చున్నాడు. అట్టి సూర్యభగవానుడు మీ కందరకు శుభపరంపరను ప్రసాదించు గాక!

**విశేషములు:-** 1) ప్రాతస్సాయంసంధ్యల విప్రులు నిత్యకర్మలయందు నిమగ్న లగుదురు. వారికి సూర్యోదయమగుటతోడనే కర్మలనుండి విరామము లభించును. 2) పగటివేళ కామ్యములను సాధించుకొనుటకు, తదనుగుణమగు క్రియలను చేయుటకు అనుకూలము కనుక సూర్యోదయము కాముకుల కతిశయ సుఖప్రదము. 3) మానవులు తమ తమ కోర్కెలను నెరవేర్చుకొనుటకు సాధనముగ అగ్న్యుపాసనము కావించెదరు. అగ్ని సమస్త దేవతలకు ప్రతినిధి. కనుక మానవులు చేసిన ఆయా కామ్యకర్మల భారమును అగ్నివహించును. అగ్ని కూడ సూర్యునికి రూపాంతరమే. దినాన్తే నిహితం తేజః సవిత్రేవ హుతాశనః - అనుచు కాళిదాసు రాత్రివేళల సూర్యతేజ మగ్నిలో ప్రవేశించునను సంప్రదాయమును వ్యక్తీకరించెను. 'అగ్నిముఖావై దేవాః' అనునది సుప్రసిద్ధము. 4) బ్రాహ్మణ విశ్రాంత్యాది సాధనకే సూర్యుడుదయించుచున్నాడనుటచే నిచట యుత్ప్రేక్షాలంకారముకలదు. ఇది భక్తి భావాంగము.

**అవతారిక:-** క్రీడాపరుడగు సూర్యుడు, రాత్రివేళల పరచుకొన్న వెన్నెల చిన్నెలను ఉదయమున అనాయాసముగ నశింపచేసి, మరల దయతో రాత్రివేళలందు చంద్రున కిచ్చును. అట్టి రవి మీ భావములందలి క్లాన్తిని పోగొట్టవలెనని కవి ప్రార్థించుచున్నాడు.

**శ్లో॥ ద్రాగాహత్య ప్రభాతే రజనిహిమవతః కౌముదీః కౌతుకేన**
**ప్రోద్యత్ప్రౌఢానుకమ్పాః పునరపి ఖలు యే సాయముజ్జీవయన్తి।**
**ఆరుణ్యే పల్లవానామథ గురుచరణాశ్శక్రగోపావలీనాం**
**తే యుష్మద్భావలీనాం దినకరకిరణాః క్లాన్తిమున్మూలయన్తు॥ 24**

**ప్రతిపదార్థము:-** రజని హిమవతః=రాత్రివేళలందు మంచు కిరణముల ప్రసరించు చంద్రుని యొక్క, కౌముదీః=వెన్నెలలను, ప్రభాతే=ప్రాతఃకాలమున, కౌతుకేన=వినోదము కొరకు, ద్రాక్=శీఘ్రముగ, ఆహత్య=నశింపచేసి, పునః =తిరిగి, ప్రోద్యత్ ప్రౌఢానుకమ్పాః - ప్రోద్యత్=పెల్లుబికిన, ప్రౌఢ=సాంద్రమగు (చిక్కని) అనుకమ్పాః=దయగలవై, సాయమ్=సాయంతనమున, ఉజ్జీవయన్తి+ అపి=బ్రతికించుచున్నవో, అథ=మరియు, పల్లవానామ్=చిగురుటాకులకు, శక్ర గోపావలీనామ్=ఆర్ద్రపురుగులకు, ఆరుణ్యే=ఎఱ్ఱతనమునందు, గురుచరణాః= మాన్యులగు గురువులో, తే=అట్టి, దినకరకిరణాః=అహర్పతియొక్క కిరణములు, యుష్మద్భావలీనామ్-యుష్మత్=మీ యొక్క, భావ=ఆలోచనలయందు, లీనామ్ =దాగియున్న, క్లాన్తిమ్=క్లేశమును (దుఃఖమును) ఉన్మూలయన్తు=నిర్మూలించు గాక!

**తాత్పర్యము:-** భూమండలైకదేశమున సూర్యుని కాంతి సాక్షాత్తు ప్రసరించ నప్పుడు మాత్రమే, చంద్రుడు తనపై ప్రసరించిన సూర్యకాంతిని ప్రతిఫలించి - వెన్నెల వెలుగులను ప్రసరింపచేయుచున్నాడు. కనుకనే రాత్రివేళల వెన్నెల, పగటి వేళల సూర్యాతపము అనుభవములోనికి వచ్చుచున్నవి. దీనినే కవి, సూర్యుడు క్రీడార్థము ప్రభాతమున వెన్నెల నుపసంహరించు చున్నాడనియు, తిరిగి శోభారహితుడగు చంద్రునిపట్ల దయతో రాత్రివేళల మరల అనుగ్రహించు చున్నాడనియు వర్ణించినాడు. చిగురుటాకులు ఆర్ద్రపురుగులు దర్శనీయమగు అరుణ వర్ణమును కలిగియుండును. ఇట్టి అరుణవర్ణము సూర్యుడను గురుని

అనుగ్రహ ఫలితమని కవి సంభావించుచున్నాడు. ఇట్టి రవి కిరణములు మీ భావగతమగు దుఃఖమును తొలగించవలెనని కవి యాకాంక్ష.

**విశేషములు:-** 1) రాత్రివేళల నిద్రాసమయమున కలల రూపమున అస్ఫుట భావము లనుభూతములగును. అట్లే జాగ్రదవస్థయందు కూడ కొన్ని భావములు స్పష్టా స్పష్టముగ గోచరించుట కద్దు. భావదశయం దిట్టియస్ఫుటతయుండుట సహజమే. పగటి వేళలు భావములకు ప్రయోగకాలము. కావున భావములు అన్యూనానతిరిక్తములుగను ప్రస్ఫుటముగను ఉన్నప్పుడు మాత్రమే ఆచరణ సాధ్యములగును. చీకట్ల కాశ్రయమగు రాత్రి అజ్ఞానమూలకములగు నస్ఫుట భావముల కాకరము. పగలు కాంతికి జ్ఞానమునకు స్ఫుటతకు సంకేతము. కనుకనే జగన్నాథకవి మానవుల భావములందున్న క్లాన్తిని రవి కిరణములు తొలగించవలెనని యాశించుచున్నాడు.

**అవతారిక:-** అద్వైతోపదేశము చేయు మార్తండ బింబము మానసాంతః స్థిత మగు అజ్ఞానాంధకారాన్ని తొలగించాలని కవి ప్రార్థిస్తున్నాడు.

**శ్లో॥** ద్రాగద్వైతం వితన్వంస్త్రిభువనమభితః కౌఙ్కుమీనాం ద్యుతీనాం
న్యక్కుర్వన్మాన్ద్యముద్రామథ రజనిరుజాం కోకసీమన్తినీనామ్।
తన్ద్రాన్ధానాన్ధ్యసిన్ధోరిహ వితతతరైరుద్ధధానం కరాగ్రై
స్స్వాన్తధ్వాన్తం ధునీతాముదయగిరిశిరశ్చుమ్బి మార్తణ్డబిమ్బమ్॥ 25

**ప్రతిపదార్థము:-** త్రిభువనమ్=ముల్లోకములకు, అభితః=అన్నివైపులా, కౌఙ్కుమీనామ్=కుంకుమ పువ్వుకు సంబంధించిన, ద్యుతీనామ్=కాంతులకు సంబంధించిన, అద్వైతమ్=ఏకత్వమును, (అభేదమును) ద్రాక్=శీఘ్రముగ, వితన్వన్=విస్తరింప చేయుచూ, అథ=తరువాత, రజనిరుజామ్=రాత్రి వియోగ దుఃఖమును అనుభవించెడి, కోకసీమన్తినీనామ్=చక్రవాక వధువుల యొక్క, మాన్ద్యముద్రామ్=(దుఃఖవివశత్వము వలన వచ్చిన) జడత్వ లక్షణమును, న్యక్కుర్వన్=తిరస్కరించుచూ (పోగొట్టుచూ) ఇహ=భూలోకమున, తన్ద్రాన్ధాన్=1) బద్ధకముచే, 2) దర్శనశక్తిహీనతచే గ్రుడ్డివారగు (ప్రాణులను), ఆన్ధ్యసిన్ధోః=గుడ్డితనపు సాగరము నుండి, వితతతరైః=సర్వవ్యాపకములయిన, కరాగ్రైః=

1) కిరణాగ్రములచే 2) చేతికొనలతో, ఉద్ధధానమ్=ఉద్ధరించెడు, ఉదయగిరి శిర శ్చుమ్బి - ఉదయగిరి=ఉదయ పర్వతము యొక్క శిరః=శిఖర భాగమును, చుమ్బి=స్పర్శించెడి, మార్తణ్డ బిమ్బమ్=సూర్యమండలము, స్వాన్త ధ్వాన్తమ్= మనస్సులోని, చీకటిని (అజ్ఞానమును) ధునీతామ్=పెకలించుగాక!.

**తాత్పర్యము:**- ప్రాతఃకాలమున మార్తండుడు ముందుగ తన అరుణారుణ కిరణములతో ముల్లోకములను ముంచెత్తి, ఎల్లెడల ఒక్క అరుణ కాంతి మాత్రమే కలదను - అద్వైతభావమును కలుగ చేయును. దీనితో ముల్లోకముల కద్వైత మేర్పడును. అట్లే రాత్రి యందు ప్రియుని విరహముతో విసిగి వేసారి నిరాశతో జడత్వమునొందిన చక్రవాక వధువుల కుదయమున మార్తండుడు చైతన్యమును ప్రసాదించును. సోమరులను, కారు చీకట్లలో మునిగి కన్నులున్ననూ గ్రుడ్డి వారగు మానవులను గుడ్డితనపు సాగరమునుండి మార్తండుడు తన సుదీర్ఘ కిరణ హస్తములతో సముద్ధరించును. ఉదయాచలాగ్రమున వెలుగొందు నిట్టి మార్తండ బింబము అజ్ఞానపు చీకట్లను పారద్రోలవలెనని కవి యాశయము.

**విశేషములు:**- 1) భిన్నముగ భాసించు పదార్థ సమూహమున నంతర్లీనముగ నున్న ఏకరూపమగు వస్తువును భావించుట అద్వైతము. ఆ ఏకత్వధర్మము శక్తి రూపమగుటచే దృశ్యము కాదు. కనుక దానిని కన్నులతో కాంచుట యసంభవము. కాని ప్రాపంచిక పదార్థ జాతమంతయు మార్తండుని యరుణా రుణ కాంతి ప్రసారముచే అరుణవర్ణమయ మగుట వలన ఏకత్వ ధర్మము నొందినట్లు భాసించును. ఇట్టి యనుభవము క్షణికమయిననూ, శాశ్వతమగు నద్వైతానుభూతికి సోపాన మగును. కనుక ప్రాణి సామాన్యమున కవశ్యప్రాప్య మగు నద్వైతగమ్యమునుపదేశించుచూ మార్తండు డిచట జగద్గురువుగా వర్ణింప బడినాడు.

**అవతారిక:**- జగన్నాథకవి సూర్యునిచట వాంఛితార్థప్రదాయకమగు కల్ప వృక్షముగ సంభావించుచు రమ్యముగ వర్ణించినాడు.

శ్లో॥ శుద్ధం బ్రహ్మాలవాలం ప్రకృతిశబలితం యస్య మూలం కరాస్తే
ద్రాఘిష్ఠస్వర్ణశాఖా వికసదరుణిమా పల్లవానాం విలాసః।

నీలం వ్యోమాలిమాలా సురసఫలభరో ధర్మకామార్థమోక్షా
స్స శ్రీమాన్వాఞ్ఛితార్థం వితరతు సతతం సూర్యకల్పద్రుమో వః॥ 26

ప్రతిపదార్థము:- యస్య=ఏ సూర్యుడను కల్పవృక్షమున, శుద్ధమ్=నిర్గుణమగు, బ్రహ్మ=బ్రహ్మ పదార్థమే, ఆలవాలమ్=పాదుగానున్నచో, యస్య=దేనికి, ప్రకృతి శబలితమ్=త్రిగుణాత్మకమాయా చిత్రితమగు బ్రహ్మము, మూలమ్=కాండమో, తే=ప్రసిద్ధములగు, కరాః=కిరణములే, ద్రాఘిష్ఠ స్వర్ణశాఖా-ద్రాఘిష్ఠ=సుదూరము వ్యాపించిన, స్వర్ణశాఖాః=బంగరు కొమ్మలో, వికసదరుణిమా - వికసత్= ఉదయించుచున్న, అరుణిమా=సిందూర వర్ణమే, పల్లవానామ్=చిగురుటాకుల యొక్క, విలాసః=వైభవమో, నీలమ్=నీలి వర్ణముగల, వ్యోమ=ఆకాశమే, అలిమాలా=తుమ్మెదల పంక్తియో, ధర్మ కామార్థమోక్షాః=ధర్మము అర్థము కామము మోక్షము అను నాలుగు పురుషార్థములే, సురసఫలభరః=రసవంతము లగు ఫలముల బరువో, సః=అట్టి, శ్రీమాన్=శోభాసంపన్నమగు, సూర్య కల్ప ద్రుమః=సూర్యుడను పారిజాత వృక్షము, వః=మీకు, వాంఛితార్థమ్=అభీష్ట ప్రయోజనమును, సతతమ్=అన్నివేళల, వితరతు=పంచి యిచ్చుగాక!

తాత్పర్యము:- శ్రీమంతము వాంఛితార్థ ప్రదాయకమునగు సూర్యుడను కల్ప వృక్షము అన్నివేళల కోరిన యర్థములను ప్రసాదింపవలెనని కవి తాత్పర్యము. ఈ సూర్యకల్పద్రుమమునకు నిర్గుణపరబ్రహ్మమే అధిష్ఠానము - అదియే పాదు. మాయావిశిష్ఠమగు బ్రహ్మమే దాని కాండము. రవి కిరణములే స్వర్ణ శాఖలు. అరుణ కాంతులే పల్లవ విలాసములు. వినీలాకాశమే తుమ్మెదల బారు. ధర్మార్థ కామమోక్షములు సార రుచిర ఫలములు.

విశేషములు:- సూర్యుని యందు కల్పద్రుమ ధర్మము లారోపింపబడుటచే నిట రూపకాలంకారము. ఇది ప్రధానమగు భక్తి భావమునకంగభూతమగుచున్నది.

అవతారిక:- సూర్యుని సకలలోక వ్యవహారములకు చోదన శక్తిగను, ప్రయాసములను పోగొట్టువానిగను, విశ్రాంతి ప్రదాతగను కవి యిచట ప్రశంసించుచున్నాడు.

శ్లో॥ నీహారం నిమ్నగాభ్యో నిఖిలనయనతో నీరజేభ్యశ్చ నిద్రాం
నీడేభ్యో నీడజానాం నికరముషిసి యే నిత్యముద్వాసయన్తి

**సాయం తేష్వేవ తేషాం పునరపి ఘృణయా కల్పయన్తే చ వాసం**
**తే వస్సన్తు ప్రయాసం ఘృణిఘనఘృణయో హన్తుమాబద్ధకక్షాః॥ 27**

**ప్రతిపదార్థము:-** యే=సూర్యకిరణములు, ఉషసి=ప్రాతఃకాలమున, నిమ్నగాభ్యః =నదుల నుండి, నీహారమ్=మంచును, నిఖిల నయనతః - నిఖిల=సమస్త జీవుల యొక్క, నయనతః=కన్నుల నుండి, నీరజేభ్యఃచ=పద్మముల నుండియు, నిద్రామ్=స్వాపమును, నీడేభ్యః=గూళ్ళ నుండి, (నివాసముల నుండి) నీడజానామ్=పక్షుల యొక్క, నికరమ్=సమూహమును, నిత్యమ్=ప్రతిదినము, ఉద్వాసయన్తి=దూరము చేయుచున్నవో, సాయమ్=అస్తమయ సమయమున, ఘృణయా=కరుణచే, పునరపి=తిరిగి, తేషామ్=వానికి (నీహారాదులకు), తేషు+ఏవ=ఆయా ప్రదేశములందే (నదులు మొదలగువాని యందు), వాసం చ=నివాసమును కూడ, కల్పయన్తే=ఏర్పరుచుచున్నవో, తే=అట్టి, ఘృణి ఘన ఘృణయః-ఘృణి =సూర్యుని యొక్క, ఘన=గొప్పవైన, ఘృణయః=కిరణములు, వః=మీ యొక్క, ప్రయాసమ్=శ్రమను, హన్తుమ్=నశింపచేయుటకు, ఆబద్ధకక్షాః =పూనిక వహించినవి, సన్తు=అగుగాక!

**తాత్పర్యము:-** సూర్యోదయమయిన వెంటనే నదుల నుండి మంచు, ప్రాణి నయనముల నుండి మరియు పద్మముల నుండి నిద్ర, తమతమ గూళ్ళ నుండి పక్షులు అదృశ్యములగును. అదృశ్యములయిన మంచు-నిద్ర-పక్షులు మరల ఆయా ప్రదేశములందే సాయం సమయమున దృశ్యములగును. కనుక సూర్య కిరణములే ప్రాణి ప్రయోజన సంపాదనకు అవకాశమును కల్గించుచూ ఉద్వాసమును, మరల దయతో ఆవాసమును కల్పించుచున్నవని అంగీకరింపక తప్పదు. అట్టి సమర్థములగు రవి కిరణములు మీ యొక్క వివిధ ప్రయాసము లను తొలగించుటయందు పూనికను వహించు గాక! యని కవి సంభావించు చున్నాడు.

**విశేషములు:-** ఘృణా శబ్దము దయావాచకము. ఘృణి యనగా దయగలవాడని స్ఫురించును. ఘృణి శబ్దము సూర్యుని సూర్య కిరణములను గూడ బోధించును. ఇచట నిద్రాదుల నపహరించుట, తిరిగి నిద్రాదుల నిచ్చుట అను నీ రెండు కార్యములు దయగల కార్యములే యనవచ్చును. నిద్రాదులు తొలగనిచో

ఆహారాదుల సంపాదన సాధ్యము కాదు, ఉదరార్తి తీరదు. తిరిగి నిద్రాదులను పొందకున్న మనశ్శరీరములు విశ్రాంతములు కాజాలవు. కనుకనే 'ఘృణి' యనునది సూర్యునికి సార్థక నామధేయము. ఇచట కిరణములు విశేష్యములుగా చెప్పబడినవి. రవి విశేషణముగ వర్ణింపబడినాడు. ఉభయత్ర 'ఘృణి' శబ్దముపయోగింపబడినది. అనగా విశేషణ విశేష్యములు రెండును సాభిప్రాయములే. కనుక నిచట పరికరాలంకారము, పరికరాంకురాలంకారము కూడ గలదు. ఈ రెండును భక్తి భావాంగములు.

**అవతారిక:-** బాహ్యాభ్యంతర తిమిరాపహర్తలు హృద్రోగపరిహర్తలు అయిన దినకర కిరణములిందు ప్రస్తుతింపబడినవి.

**శ్లో॥ సంహృత్య ద్రాగ్బహిస్థం తిమిరకులమథాభ్యన్తరం హర్తుకామా**
**రన్ధ్రాలీభిర్గృహాణాముదరమనుదినం యేఽవిశఙ్కం విశన్తి।**
**భానోస్తేఽమీ హృషీకాణ్యఖిలతనుభృతాం హర్షయన్తో హితేహా**
**హృద్రోగం సంహరన్తాం హిమమహిమహృతో హేమహృద్యాః కరా నః॥28**

ప్రతిపదార్థము:- యే=రవి కిరణములు, బహిఃస్థమ్=బయటనున్న, తిమిర కులమ్=చీకట్ల సమూహమును, ద్రాక్=శీఘ్రముగ, సంహృత్య=తొలగించి, అథ= తరువాత, అభ్యన్తరమ్=లోనిదగు, (తిమిరమును), హర్తుకామాః=తొలగింప గోరినవై, అనుదినమ్=ప్రతిరోజు, రన్ధ్రాలీభిః=సన్నని కన్నముల ద్వారమున, గృహాణామ్=ఇళ్ళ యొక్క ఉదరమ్=మధ్యభాగమును, అవిశఙ్కమ్= సందేహింపక, విశన్తి=ప్రవేశించుచున్నవో, అఖిల తనుభృతామ్ - అఖిల=సమస్త మైన, తనుభృతామ్=ప్రాణులయొక్క, హృషీకాణి=ఇంద్రియములను, హర్షయన్తః =సంతోషింపచేయు, హితేహాః=శ్రేయస్సును కోరు, హిమ మహిమ హృతః - హిమ=మంచుయొక్క, మహిమ=ప్రభావమును, హృతః=అపహరించునట్టి, హేమహృద్యాః=బంగారమువలె మనోహరములగు, తే=ప్రసిద్ధములయిన, అమీ =ఈ, భానోః=సూర్యుని యొక్క, కరాః=కిరణములు, నః=మాయొక్క, హృద్రోగమ్ =మనఃపీడను (హృదయరోగమును) సంహరన్తామ్=తొలగించుగాక!

**తాత్పర్యము:-** రవి కిరణములు ముందుగ బాహ్య ప్రదేశములందున్న చీకట్ల

సమూహములను, నిశ్శేషముగ తొలగించి ఇండ్లకుండు సన్నని రంధ్రముల ద్వారా గృహాంతర్భాగములను సహితము చేరుకొని చీకట్లను తొలగించును. నిఖిల ప్రాణులకు శ్రేయస్సును కలిగింపనెంచిన రవి కిరణములు ఇంద్రియము లకు సుఖసంతోషములను కలిగించును. స్వర్ణోజ్జ్వలములగు భాను కిరణములు హిమ ప్రభావమును తొలగించి హృద్రోగములను కూడ దూరము చేయును.

**విశేషములు:-** 1) అచేతనములగు గృహముల యొక్క బాహ్యాభ్యంతరము లందున్న చీకట్లను భానుకిరణములు విశేష ప్రయత్నముతో తొలగించుచున్నవి. ఇక సచేతనులకు హితమును గూర్చుటలో సందేహమేమున్నది? కనుకనే రవి కిరణములింద్రియములకు పరమప్రీతిని కలిగించునని చెప్పబడినది. 2) హృదయ రోగము - హృదయములో చేరిన మలిన పదార్థముల చేతను, నెమ్ము చేతను ఏర్పడును. హృదయరోగములు శ్వాసకోశ వ్యాధులు వర్ష శిశిర ఋతువులందు వృద్ధినొందుట ప్రసిద్ధము. రవి కిరణములు హిమము యొక్క దుష్ప్రభావమును తొలగించుననియు, హృదయరోగముల నుపశమింప చేయు ననియు కవి ఇచట చక్కగ సూచించినాడు. 'ఆరోగ్యం భాస్కరాదిచ్ఛేత్' అని కదా ఆర్యోక్తి.

**అవతారిక:-** బ్రహ్మాండమున కలంకార ప్రాయములు, పద్మవికాసకలా కుశలములు నగు చండాంశుని కిరణములు పాండురోగమును తొలగించుగాక! యని కవి సంభావించుచున్నాడు.

**శ్లో॥** బ్రహ్మాణ్డం మణ్డయన్తో వియతి వలయినో మణ్డలైరణ్డజానాం
పాఖణ్డాన్దణ్డయన్తో దనుతనుజనుషశ్శోభితాఖణ్డలాశాః
యే షణ్డాన్పౌణ్డరీకాన్విదలయితుమథోద్దణ్డపాణ్డిత్యభాజ
స్తే చణ్డాంశోరచణ్డాస్త్వరితమిహ కరాః పాణ్డుతాం ఖణ్డయన్తు॥ 29

**ప్రతిపదార్థము:-** యే=రవి కిరణములు, బ్రహ్మాణ్డమ్=సమస్త సృష్టిని, మణ్డయన్తః =అలంకరించునవో, వియతి=ఆకాశమునందు, అణ్డజానామ్=పక్షుల యొక్క, మణ్డలైః=గుండ్రని పంక్తులచే, వలయినః=కంకణ శోభను పొందుచున్నవో, దనుతనుజనుషః=దానవాంశతో కూడిన, పాఖణ్డాన్=అవైదికులను (అనాచారు

లను), దణ్డయన్తః=శిక్షించుచున్నవో, శోభితాఖణ్డలాశాః - శోభిత=అలంకరింప బడిన, ఆఖణ్డల=ఇంద్రునిదగు, ఆశాః=దిక్కుకలిగినవో, అథ=మరియు, పౌణ్డరీ కాన్=పద్మ సంబంధమగు, షణ్డాన్=సమూహములను, విదలయితుమ్=వికసింప చేయుటకు, ఉద్దణ్డ పాణ్డిత్య భాజః-ఉద్దణ్డ=గొప్పదగు, పాణ్డిత్య=విజ్ఞానమును, భాజః=కలిగియుండునవో, తే=అట్టి, చణ్డాంశోః=ఖరాంశుడగు సూర్యుని యొక్క, అచణ్డాః=ప్రసన్నములగు, కరాః=కిరణములు, త్వరితమ్=వేగముగా ఇహ=ప్రాణి లోకమున, పాణ్డుతామ్ =పాండురోగమును, ఖణ్డయన్తు=పోగొట్టుగాక!

**తాత్పర్యము:-** రవి కిరణములు తమ కాంతులచే బ్రహ్మాండమును సుందర తరము కావించును. ఆకాశమున వలయాకారముగ తిరుగు పక్షి సమూహము లను కంకణములతో శోభిల్లును. దానవాంశకల దురాచారపరులను దండించును. తూర్పు దిక్కును, తమ ఉదయముచే రమ్యతర మొనర్చును. కమల వనములకు వికాసము కలిగించు లీలలో నేర్పరులు. అట్టి సూర్యుని ప్రసన్నములగు కిరణములు మానవ లోకమున పాండు రోగము నున్మూలించు గాక!

**విశేషములు:-** 1) ఇచట 'ణ్డ' అను సంయుక్తాక్షరము పునఃపునరావృత్తిని పొంది సూర్యుని చండత్వమును స్ఫురింపచేయుచున్నది. అను ప్రాసమిచట శబ్దా లంకారము. ఈ శ్లోకమున శబ్దాలంకార మర్థగాంభీర్యమును జయించినట్లని పించును. 'ణ్డ' వర్ణ యుక్త పదము లనేకములిచట రాశి పోయబడినవి. 2) పాండు రోగము శరీరము నంతటిని పాండు వర్ణము (తెలుపు + పసుపు కలసిన వర్ణము) తో నింపివేయును. దీనికే 'కామెర్లు' అనియు వ్యవహారము కలదు. కళ్ళు, మూత్రము మొదలగునవి పసుపు రంగులోనికి మారును. 'కామెర్లరోగికి లోకమంతా పచ్చగా కనపడుతుంది' అంటుంటారు. ఇది ప్రధానంగా జీర్ణకోశ వ్యవస్థకు కలుగు హాని వలన సంభవించును. భాస్కరు డారోగ్యప్రదాత కావున దీనిని తొలగించునని కవి యాశయము.

**అవతారిక:-** వేదోపనిషత్తులందు ప్రతిపాదింపబడిన సర్వాన్తర్యామి పరమ పురుష స్వరూపుడనగు సూర్యభగవానుని స్వరూపమిందు ప్రస్తుతింపబడినది.

శ్లో॥ ఊర్ధ్వం పాపావలిభ్యస్థిత ఇతి జగదే యస్య వేదైరుదాఖ్యా
నిన్యుః కప్యాసనాభం ఖలు సహచరతాం నేత్రయోః పుణ్డరీకమ్।
గేష్ణావృక్సామ యస్య ద్రుతకనకనిభశ్మశ్రుకేశాఖిలాఙ్గ
స్సోఽయం సర్వాన్తరాత్మా తవ దిశతుతరాం వాసరేశశ్శివాని॥ 30

ప్రతిపదార్థము:- పాప+ఆవలిభ్యః=పాపముల సమూహము కంటె, ఊర్ధ్వమ్=పై భాగమున, (అతీతముగ), స్థితః=ఉన్నాడు, ఇతి=ఈ కారణముననే, యస్య=సూర్యభగవానునికి, వేదైః=ఋగ్యజుస్సామాథర్వణములచే, ఉదాఖ్యా= (ఉన్నతుడను నర్థమును బోధించు) 'ఉద్' అనుపేరు,జగదే=స్పష్టముగ ప్రతిపాదింపబడినదో, కప్యాసనాభమ్=కోతి యొక్క పృష్ఠభాగముతో సమాన మయిన వర్ణము కల, పుణ్డరీకమ్=కమలమును, యస్య=సూర్యుని యొక్క, నేత్రయోః=కన్నులకు, సహచరతామ్=సమానత్వమును (పోలికను) నిన్యుః= ప్రతిపాదించిరో, (మంత్ర ద్రష్టలగు మహర్షులిచట కర్తలు) యస్య=ఏ సూర్య భగవానునికి, ఋక్=ఋగ్వేద మంత్రములు, సామ=సామవేదమంత్రములు, గేష్ణౌ=అన్వేషకములో, సః =అటువంటి, ద్రుత...... అఖిలాఙ్గః - ద్రుత=కరగిన కనక=బంగారముతో, నిభ=సమానమయిన వర్ణము కల, శ్మశ్రు=గడ్డము, కేశ= జుట్టు, అఖిల+అఙ్గః =సమస్త అవయవములు కలవాడును, సర్వ+అన్తరాత్మా= సమస్త ప్రాణుల హృదయాంతర్వర్తిగా నుండు వాడును, అయమ్=ఈ, వాసరేశః=దినాధిపతియగు సూర్యుడు, తవ=నీకు, శివాని=శుభములను, దిశతుతరామ్= మిక్కిలిగా ఇచ్చుగాక?

**తాత్పర్యము:-** వేదములు సూర్యుని 'ఉద్' అను గొప్పపేరుతో ప్రస్తుతించినవి. సమస్త పాపముల కతీతుడగుట ఇచట హేతువు. సూర్యమండలాంతర్వర్తియగు పరమపురుషుని నేత్రములు పుండరీకముల వంటివని మహర్షులు స్తుతించిరి. ఋక్కులు సామములు ఇతని స్వరూపమును అన్వేషించుచుండును. ఆ పరమపురుషుని శరీరము కరగిన మేలిమిబంగారు వన్నెతో ప్రకాశించును. గడ్డము కేశములు సమస్త అవయవములు స్వర్ణకాంతులతో నొప్పారును. ఇట్టి సర్వాంతర్యామి దినాధిపతియగు సూర్యభగవానుడు శుభ పరంపర ననుగ్రహింపవలెనని కవి యాశీస్సుల నందించుచున్నాడు.

**విశేషములు:-** ఛాందోగ్యోపనిషత్తున 1వ అధ్యాయము 6వ ఖండమునందు సగుణోపాసనలో భాగముగ సూర్యమండలాంతర్వర్తియగు పరమ పురుషుని స్వరూపము వర్ణింపబడినది.

ఆ పరమపురుషుడు సువర్ణవర్ణముకల జ్యోతిర్మయు డనియు, గోళ్ళనుండి గడ్డము కేశములతో సహా సమస్తావయవములు సువర్ణ వర్ణములనియు, అతని నేత్రములు మాత్రము కప్యాసనాభములగు పుండరీకముల వంటివనియు వర్ణింపబడినది. మరియు అతడు సర్వ పాపములకు అతీతుడు కనుక 'ఉద్' అను పేరుతో పిలువబడుచున్నాడనియు, ఎవరీ పరమ పురుషు నుపాసించి, తత్స్వరూపమును దర్శింపగలరో వారు కూడ సకలపాపముల కతీతు లగుదురనియు ఛాందోగ్యమున వివరింపబడినది. ఋక్సామములితని అవయవములవంటి వనియు, ఇతని నన్వేషించునవనియు అచటనే సూచింపబడినది. ఇత దూర్ధ్వలోకములకును దేవత్వాది విశేష ఫలములకును అధిపతియని చెప్పబడినది. కనుకనే జగన్నాథ పండితుడు గూడ తన 'సుధాలహరి' చరమ శ్లోకమున ఉపనిషదుద్ఘుష్టమయిన పరమ పురుష తత్త్వమునిచట ప్రస్తుతించినాడు. పూర్వము ప్రతిపాదింపబడిన కామితార్థ ప్రదాయకత్వాది లక్షణములకీ యుపనిష ద్వర్ణన మూలమని భావింపవచ్చును. దానిని కావ్యఫలశ్రుతి రూపముగను అంత్యమందు చేయు మంగళముగను భావింపనగును.

2) పరమపురుషుని లోచనములకు 'కప్యాసము' నుపమానముగా చెప్పుట దోషమగునేమో! అను శంకను పరిహరించుచూ ఆదిశంకరులు - కప్యాసము పుండరీకమునకుపమాన మనియు, పుండరీకము పరమ పురుషుని నేత్రములకుపమానమనియు వివరించినారు.

3)శ్రీరామానుజులు నీచోపమానత్వ దోషమును పరిహరించుటకు కప్యాసశబ్దమునకు మూడర్థములను కల్పించి నారు.

1) కపి+ ఆస=సూర్యునిచే వికసింపచేయబడినది (పద్మము),

2) క+పి= నీటిని పీల్చునది (తామర నాళము), దాని మీద నుండునది పద్మము

3) క + అప్యాస=నీటిలో నుండు పద్మము. ఈ అర్థములు బలాదున్నేయము లనిపించును. కనుక నాదిశంకరుల వ్యాఖ్యానమే శరణ్యమనిపించును.

ఇతి శ్రీజగన్నాథ పణ్డితరాజ విరచితా
'సుధాలహరీ'
సమాప్తా

శ్లో॥ సోమయాజీ పితా యస్య మాతాసీతేతి విశ్రుతా।
యస్య పత్నీ చ గాయత్రీ ఈమనిశ్చ గృహాభిధా॥

శ్లో॥ తేన నారాయణాఖ్యేన సత్యపూర్వేణ ధీమతా।
శ్రీమాతు రనసూయాయాః పదపఙ్కజ రేణునా॥

శ్లో॥ విహితా "పావనీ" వ్యాఖ్యా సూర్యానుగ్రహదాయినీ।
ఆంధ్రానామ్ ప్రీతయే భూయాత్సుధియాం గుణవేదినామ్॥

శ్లో॥ ఆదిత్యస్య ప్రసాదేన సన్తు భద్రాణి సర్వశః।
అన్త్యం బాహ్యాన్తరం నశ్యే ల్లోకాస్సన్తు నిరామయాః॥

ఇతి శ్రీ పావనీ వ్యాఖ్యా సమాప్తా

శ్రీః

శ్రీః

# ఋగ్వేద సూర్య సూక్తమ్

శ్లో॥ చిత్రం దేవానాముదగాదనీకం
చక్షుర్మిత్రస్య వరుణస్యాగ్నేః।
ఆప్రా ద్యావాపృథివీ అన్తరిక్షం
సూర్య ఆత్మా జగతస్తస్థుషశ్చ॥ 1

శ్లో॥ సూర్యో దేవీ ముషసం రోచమానాం
మర్యో న యోషామభ్యేతి పశ్చాత్।
యత్రా నరో దేవయన్తో యుగాని
వితన్వతే ప్రతి భద్రాయ భద్రమ్॥ 2

శ్లో॥ భద్రా అశ్వా హరితః సూర్యస్య
చిత్రా ఏతగ్వా అనుమాద్యాసః।
నమస్యన్తో దివ ఆ పృష్ఠమస్థుః
పరి ద్యావాపృథివీ యన్తి సద్యః॥ 3

శ్లో॥ తత్సూర్యస్య దేవత్వం తన్మహిత్వం
మధ్యా కర్తోర్వితతం సం జభార।
యదేదయుక్త హరితః సధస్థా
దాద్రాత్రీ వాసస్తనుతే సిమస్మై॥ 4

శ్లో॥ తన్మిత్రస్య వరుణస్యాభిచక్షే సూర్యో
రూపం కృణుతే ద్యోరుపస్థే।
అనన్త మన్యద్రుశదస్య పాజః
కృష్ణ మన్యద్ధరితః సం భరన్తి॥ 5

శ్లో॥ అద్యా దేవా ఉదితా సూర్యస్య
నిరంహసః పిపృతా నిరవద్యాత్।
తన్నో మిత్రో వరుణో మామహన్తా
మదితిః సిన్ధుః పృథివీ ఉత ద్యౌః॥ 6

శ్రీః

శ్రీః

# సుధాలహరీ

శ్లో॥ ఉల్లాసః ఫుల్లపఙ్కేరుహపటలపతన్మత్తపుష్పన్ధయానాం
నిస్తారశ్శోకదావానలవికలహృదాం కోకసీమన్తినీనామ్।
ఉత్పాతస్తామసానాముపహతమహసాం చక్షుషాం పక్షపాత
స్సఙ్ఘాతః కోఽపి ధామ్నామయముదయగిరిప్రాన్తతః ప్రాదురాసీత్॥ 1

శ్లో॥ పద్మద్రోహోద్ధురాణాం ధవలితహరితామైన్దవీనాం ద్యుతీనాం
దర్పం ద్రాగ్ద్రావయన్తో విదలదరుణిమోద్రేకదేదీప్యమానాః।
దూరాదేవాన్ధకారాన్ధితధరణితలద్యోతనే బద్ధదీక్షా
స్తే దైన్యధ్వంసదక్షా ముదముదయదినోద్వేలదుస్రా దిశన్తు॥ 2

శ్లో॥ త్రాతామీవార్తలక్షాః ప్రతిదినవిహితానేకగీర్వాణరక్షా
భక్తానాం కల్పవృక్షాస్స్ఫురదనలగతస్వర్ణభాసాం సదృక్షాః।
లోకక్షేమాత్తదీక్షా నలినపరిషదాం దత్తసౌభాగ్యలాక్షా
దుర్వృత్తధ్వంసదక్షా మమ రవికిరణాస్సన్త్వఘానాం విపక్షాః॥ 3

శ్లో॥ ప్రాలేయానాం కరాలాః కవలితజగతీమణ్డలధ్వాన్తజాలా
స్త్రాతస్వర్లోకపాలా విదళదరుణిమక్షిప్తబాలప్రవాలాః।
విశ్లిష్యత్కోకబాలాజ్వరహరణభవత్కీర్తిజాలైర్జటాలా
వ్యోమవ్యాప్తౌ విశాలాస్త్వయి దధతు శివం భాస్వతో భానుమాలాః॥ 4

శ్లో॥ నిర్భిద్య క్ష్మారుహాణామతిఘనముదరం యేషు గోత్రాం గతేషు
ద్రాఘిష్ఠస్వర్ణదణ్డభ్రమభృతమనసస్సన్నిధిత్సన్తి పాదాన్।
యై స్సమ్భిన్నే దలాగ్రప్రచలహిమకణే దాడిమీబీజబుద్ధ్యా
చఞ్చూచాఞ్చల్యమఞ్చన్తి చ శుకశిశవస్తేఽంశవః పాన్తు భానోః॥ 5

శ్లో॥ అహ్ని క్రీడోచితానాం సరసిరుహలసన్మన్దిరాణాం ప్రభాతే
ప్రోద్ఘాట్య ద్రాక్కపాటాన్యథ కుముదగృహాన్ముద్రయన్తో విముక్తాన్।
సిఞ్చన్తః కిఞ్చ భూమీతలమఖిలమపి క్షుణ్ణకాశ్మీరనీరైః
పాయాసుశ్శ్రీసపర్యావిరచనపటవః పద్మబన్ధోః కరా నః॥ 6

శ్లో॥ ఆలేపా హిఙ్గులీనామివ ధరణిభుజామచ్ఛసౌధాగ్రమౌళి
ష్వగ్రేషు క్ష్మారుహాణామభినవవిదలత్పల్లవోల్లాసలీలాః।
ప్రౌఢప్రాలేయపుఞ్జోపరి చితఖదిరాఙ్గారభారా ఇవారా
త్పారావారాత్ప్రయాన్తో దినకరకిరణా మఙ్గలం నః క్రియాసుః॥ 7

శ్లో॥ కీలాలైః కుఙ్కుమానాం నిఖిలమపి జగజ్జాలమేతన్నిషిక్తం
ముక్తాశ్చోన్మత్తభృఙ్గా విదలితకమలక్రోడకారాగృహేభ్యః।
ఉత్సృష్టం గోసహస్రం బహలకలకల శ్రూయతే చ ద్విజానాం
భాగ్యైర్వృన్దారకాణాం హరిహయహరితా సూయతే పుత్రరత్నమ్॥ 8

శ్లో॥ యా సూతే సర్వభూతేష్వనుదినముదయే చేతనాయా విలాసా
న్యాస్తీ సాయం నికాయం జలనిధిజఠరం సఞ్చరీహర్తి సద్యః।
అత్యర్థం వర్ధయన్తీ మణిగణసుషమాసమ్పదం రత్నసానో
స్సా నో భానోః ప్రభా నో నయనసరణితో దూరతో జాతు యాతు॥ 9

శ్లో॥ నీహారైర్నీరజానాం నిబిడతమతమోరాశిభిర్లోచనానాం
శ్రౌతస్మార్తక్రియాణామపి ఖలు నిశయా నాశమాలక్ష్య దూరాత్।
సద్యస్సిన్ధోస్సకాశాదధికతరజవేనాగతా వాసవాశా
మాశాపాశానశేషానపహరతుతరాం తీక్ష్ణభానోః ప్రభా నః॥ 10

శ్లో॥ శీతే శోకం శశాఙ్కే కృశతమరుచితామాశు నాశం నిశాయాం
ధిక్కారం ధ్వాన్తవర్గే కుముదపరిషది ప్రోద్గమం దీనతాయాః।
పాణ్డిత్యం పుణ్డరీకేష్వనుదినమధికాం కాన్తిమాశాసు తన్వ
న్నన్వఙ్చత్యన్వహం ద్యాముషసి కరుణయా విశ్వవన్ద్యో వివస్వాన్॥ 11

శ్లో॥ స్వాపం స్వాపాకులానాం గదమథ గదినామన్ధకారం త్రిలోక్యాః
పాపం పాపావిలానాం సపది పరిహరన్నాగతో వాసవాశామ్।
నిత్యప్రస్థానలీలాకుపితకమలినీనర్మనిర్మాణకర్మా
విశ్వార్తిత్రాణధర్మా గగనమణిరసౌ పాతు శర్మానిశం వః॥ 12

శ్లో॥ అన్తర్నీరం నదీనామనుదినముదయే బిమ్బితా యే సమన్తా
దీర్వాణాద్రేరుదఞ్చన్మణిగణజటిలాం మేదినీం దర్శయన్తి।
విప్రప్రోక్షిప్తసన్ధ్యాఞ్జలిజలకణికాజాలమాకాశమధ్యే
మాణిక్యవ్రాతయన్తో మమ మిహిరకరా మాన్ద్యమున్మూలయన్తు॥ 13

శ్లో॥ ప్రత్యగ్రోఢాః ప్రగల్భా యువతిపరిషదః ప్రోషితప్రాణనాథా
యస్మిన్నస్తాద్రిమౌలేరుపరిమణిమయచ్ఛత్రలీలాం దధానే।
సత్రాసం సప్రసాదం పరిణతకరుణం లోచనాన్యుత్క్షిపన్తి
స్థేమానం స ప్రియాణాం ఘటయతు భగవాన్పద్మినీవల్లభో వః॥ 14

శ్లో॥ అన్తర్ద్యావాపృథివ్యోరధిరజని భృతానన్ధకారానుదారా
న్విద్రావ్య ద్రాక్తదీప్తైరివ జగదరుణం శోణితైర్యద్విధత్తే।
సాయం ప్రాతశ్చ సన్ధ్యాఞ్జలిమవనిసురాస్సమ్ప్రయచ్ఛన్తి యస్మై
తస్మై కస్మైచిదేతన్మమ పరమహసే దేవతాయై నమోఽస్తు॥ 15

శ్లో॥ త్రాణం త్రైవిష్టపానాం తరణమథ పయస్తోమతామ్యత్తనూనాం
వేదానామప్రతర్క్యత్రిగుణమయతయా యత్త్రయాణాం తురీయమ్।
తత్తాదృక్తున్దిలాయాస్తరుణతరతమస్సన్తతేరన్తకృత్త్వాం
తేజస్త్రైలోక్యతామ్రీకరణచతురిమ త్రాయతాం తీక్ష్ణభానోః॥ 16

శ్లో॥ గీర్వాణ గ్రామణీభిర్గగనతలగతైర్గీర్భిరుద్గీథగాభి
ర్గన్ధర్వైశ్చాపి గీతా గుణగణగరిమోద్గారిగాథాసహస్రైః।
గాహంగాహం గృహాలీరగతికగదినాం గన్ధయన్తో గదార్తిం
గ్లానిగ్రామం గ్రసన్తాం గ్రహరుచిగురవో గోపతేర్గోవిలాసాః॥ 17

శ్లో॥ జీవాతుర్జాడ్యజాలాధికజనితరుజాం తప్తజామ్బూనదాభం
జఞ్జాలం జాఙ్ఘికానాం జలధిజఠరతో జృమ్భమాణం జగత్యామ్।
జీవాధానం జనానాం జనకమథ రుచో జీవజైవాతృకాదే
ర్జ్యోతిర్జాజ్వల్యమానం జలజహితకృతో జాయతాం వో జయాయ॥ 18

శ్లో॥ ప్రాతర్నిర్గత్య గోభిస్సహ రుచివిషయే సఞ్చరన్త్యోఽపి హ్నా తాభి
స్సాకం సాయం నికాయం ప్రతి పునరపి యాస్సమ్ప్రయాతుం త్వరన్తే।
యాసాం దివ్యప్రభావస్త్రిజగదఘవనశ్రేణిదావైకదావః
క్షేమం తన్వన్తు తా వశ్శివమయవపుషో వాసరేశస్య గావః॥ 19

శ్లో॥ వృన్దైర్వృన్దారకాణాం దనుజతనుజుషాం రక్షసాఞ్చ క్షపాన్తే
గన్ధర్వాణాం ధురీణైః ప్రణతమహివరైః కిన్నరైర్యన్నరైశ్చ।
విద్యాం హృద్యాం నిజేభ్యో వితరదవిరతం దీప్తిభిర్దీపయద్ద్యా
మద్యాదాద్యామవిద్యామిదముదయగిరేరుద్యదర్కస్య బిమ్బమ్॥ 20

శ్లో॥ ఆపాథోజాసనాయుః క్షణలవఘటికాద్యాత్మకం కాలచక్రం
ప్రాహుః పూర్వే పురాణాగమవిషయవిదో యస్య లీలావిలాసమ్।
భావానాం షడ్వికారానథ ఖలు గతిభిర్యశ్చ నిత్యం ప్రసూతే
స ప్రాతః పౌరుహూతే పరిలసతి హరిన్మణ్డలే చణ్డభానుః॥ 21

శ్లో॥ అఙ్గాని బ్రాహ్మణానాముషసి హిమభరాసఙ్గతో భఙ్గురాణి
వ్యాలక్ష్య ద్రాక్ప్రయాతా రిపుజనితరుషేవారుణా వాసవాశామ్।
ధర్మధ్వంసోద్ధురాణామఖిలమపి కులం జక్షత శ్శ్యైభితక్ష్మా
యక్ష్మాణం మే హరన్తు త్వరితమఘభిదోభానవశ్చణ్డభానోః॥ 22

శ్లో॥ విశ్రాన్తిం బ్రాహ్మణానాం సుఖమతిశయితం కామినాం స్థాయిలీలా
మమ్భోజానాం ప్రబోధం కుసుమపరిషదాం యశ్చికీర్షన్దయార్ద్రః।
నిర్యాత్యన్తస్సముద్రాత్సకలమపి నృణాం భారమాధాయ వహ్నౌ
వహ్నేయాహ్నామధీశస్స భవతు భవతాం భూయసే మఙ్గలాయ॥ 23

శ్లో॥ ద్రాగాహత్య ప్రభాతే రజనిహిమవతః కౌముదీః కౌతుకేన
ప్రోద్యత్రైవ్యధానుకమ్పాః పునరపి ఖలు యే సాయముజ్జీవయన్తి।
ఆరుణ్యే పల్లవానామథ గురుచరణాశ్శక్రగోపావలీనాం
తే యుష్మద్భావలీనాం దినకరకిరణాః క్లాన్తిమున్మూలయన్తు॥ 24

శ్లో॥ ద్రాగద్వైతం వితన్వంస్త్రిభువనమభితః కౌఙ్కుమీనాం ద్యుతీనాం
న్యక్కుర్వన్నాన్యముద్రామథ రజనిరుజాం కోకసీమన్తినీనామ్।
తన్ద్రాన్ధానాన్యసిన్ధోరిహ వితతతరైరుద్దధానం కరాగ్రై
స్స్వాన్తధ్వాన్తం ధునీతాముదయగిరిశిరశ్చుమ్బి మార్తాణ్డబిమ్బమ్॥ 25

శ్లో॥ శుద్ధం బ్రహ్మాలవాలం ప్రకృతిశబలితం యస్య మూలం కరాస్తే
ద్రాఘిష్ఠస్వర్ణశాఖా వికసదరుణిమా పల్లవానాం విలాసః।
నీలం వ్యోమాలిమాలా సురసఫలభరో ధర్మకామార్థమోక్షా
స్స శ్రీమాన్వాఞ్ఛితార్థం వితరతు సతతం సూర్యకల్పద్రుమో వః॥ 26

శ్లో॥ నీహారం నిమ్నగాభ్యో నిఖిలనయనతో నీరజేభ్యశ్చ నిద్రాం
నీడేభ్యో నీడజానాం నికరముషిసి యే నిత్యముద్వాసయన్తి।
సాయం తేష్వేవ తేషాం పునరపి ఘృణయా కల్పయన్తే చ వాసం
తే వస్సన్తు ప్రయాసం ఘృణిఘనఘృణయో హన్తుమాబద్ధకక్షాః॥ 27

శ్లో॥ సంహృత్య ద్రాగ్బహిస్స్థం తిమిరకులమథాభ్యన్తరం హర్తుకామా
రన్ధ్రాలీభిర్గృహాణాముదరమనుదినం యేఽవిశఙ్కం విశన్తి।
భానోస్తేఽమీ హృషీకాణ్యఖిలతనుభృతాం హర్షయన్తో హితేహా
హృద్రోగం సంహరన్తాం హిమమహిమహృతో హేమహృద్యాః కరా నః॥ 28

శ్లో॥ బ్రహ్మాణ్డం మణ్డయన్తో వియతి వలయినో మణ్డలైరణ్డజానాం
పాఖణ్డాన్దణ్డయన్తో దనుతనుజనుషశ్శౌభితాఖణ్డలాశాః।
యే షణ్డాన్పౌణ్డరీకాన్విదలయితుమథోద్దణ్డపాణ్డిత్యభాజ
స్తే చణ్డాంశోరచణ్డాస్త్వరితమిహ కరాః పాణ్డుతాం ఖణ్డయన్తు॥ 29

శ్లో॥ ఊర్ధ్వం పాపావలిభ్యస్స్థిత ఇతి జగదే యస్య వేదైరుదాఖ్యా
నిన్యుః కప్యాసనాభం ఖలు సహచరతాం నేత్రయోః పుణ్డరీకమ్।
గేష్ణావృక్ణామ యస్య ద్రుతకనకనిభశ్మశ్రుకేశాఖిలాఙ్గ
స్సోఽయం సర్వాన్తరాత్మా తవ దిశతుతరాం వాసరేశశ్శివాని॥ 30

# సుధాలహరీ - శ్లోకానుక్రమణికా





ఓన్నమస్సూర్యాయ

# దోర్బల విశ్వనాథశర్మ గారి
## వ్యాఖ్యాన గ్రంథములు

| | | |
|---|---|---|
| 1. మూకపంచశతి | | |
| a) ఆర్యాశతకమ్-సారోల్లాసినీ వ్యాఖ్యా | - | రూ. 25-00 |
| b) కటాక్షశతకమ్-సారోల్లాసినీ వ్యాఖ్యా | - | 15-00 |
| c) మందస్మితశతకమ్-సారోల్లాసినీ వ్యాఖ్యా | - | 15-00 |
| d) స్తుతి శతకమ్-సారోల్లాసినీ వ్యాఖ్యా | - | 30-00 |
| e) పాదారవిన్దశతకమ్-సారోల్లాసినీ వ్యాఖ్యా | - | 25-00 |
| 2. శివమీడేస్తవః-హర్షిణీ వ్యాఖ్యా | - | 8-00 |
| 3. శ్రీహలాయుధ శివస్తోత్రమ్-డమరుక వ్యాఖ్యా | - | 20-00 |
| 4. చణ్డీశతకమ్-ప్రసాదినీ వ్యాఖ్యా | - | 30-00 |
| 5. హరిమీడేస్తవః-మచర్చికా వ్యాఖ్యా | - | 20-00 |
| 6. పరశమ్భుమహిమ్నః స్తోత్రమ్-శివప్రియ వ్యాఖ్యా | - | 40-00 |
| 7. అమరుక శతకము-మనసిజ వ్యాఖ్యా | - | 20-00 |
| 8. శ్రీ సోమనాథ భాష్యమ్-పరిష్కరణ | - | 25-00 |
| 9. శ్రీ శివకర్ణామృతస్తోత్రమ్-1వ భాగము ఆస్వాదినీ వ్యాఖ్యా | - | 30-00 |
| శ్రీ శివకర్ణామృతస్తోత్రమ్-2వ భాగము ఆస్వాదినీ వ్యాఖ్యా | - | 30-00 |
| శ్రీ శివకర్ణామృతస్తోత్రమ్-3వ భాగము ఆస్వాదినీ వ్యాఖ్యా | - | 30-00 |
| 10. ఏకశ్లోకరామాయణమ్ - మోహనరూపావ్యాఖ్యా | - | 20-00 |
| 11. భాగవత చతుఃశ్లోకీ - మన్త్రవ్యాఖ్యా | - | 20-00 |
| 12. శ్రీ శివమహిమ్నః స్తోత్రమ్ - విభూతివ్యాఖ్యా | - | 15-00 |
| 13. చిద్గగనచన్ద్రికా - శివానందినీ వ్యాఖ్యా | - | త్వరలో |

82



త్వరలో

శ్రీ నీలకణ్ఠ దీక్షిత విరచితః

# ఆనందసాగరస్తవః

మరాళీ వ్యాఖ్య

(ఆంధ్ర ప్రతిపదార్థ–తాత్పర్య–వ్యాకరణవిశేషములు

**శ్రీ E.V. సత్యన్నారాయణమూర్తి**

శ్రీ గోరంట్ల వెంకన్న ఓరియంటల్ కళాశాల–తిమ్మసముద్రం)

తో వెలువడనున్నది.



ప్రతులకు

**సాధన గ్రంథ మండలి, తెనాలి - 522 201**

## Check List

| | | | |
|---|---|---|---|
| **Book Number** | RMB09A106 | **Date** | 08/08/2022 |
| **Front Cover** | Yes | **Back Cover** | Yes |
| **Blank Pages** | CI, 81 | | |
| **Missing Pages** | NO | | |
| **Prepared By** | K. Yameema | **Cutting By** | K. Yameema |
| **Scanned By** | pradyusha | **Pages** | 85 |